Regd No. N. 45 / M. 3813

102558

వెల ఒక అణా

★ సోలం బ్రిటిషునుండి జర్మనులకు మారుట ★

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

★ అబిసీనియాలో బ్రిటిషు విజయము ★

సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర వైశాఖబ॥ ౧౨ (౧౨-౮-౧౩౫౦ ఫ.) గురువారము సంచి.

# ఇరాఖులో జర్మను విమానాల దెబ్బలు

## ఇటాలీయ వైస్రాయి బ్రిటనుకు లొంగుట

హెర్ హెస్ కథ

హిట్లరుయొక్క డెప్యూటీయు, నాజీపార్టీనాయకుడునునగు హెర్ రుడోల్ఫు హెస్ గారుదక్షిణజర్మనీలో అగ్స్బర్గునుండి మే ౧౦వ తేదిరాత్రివిమానంలోబయలుదేరి ౮౦౦ మైళ్ల ప్రయాణము చేసినతరువాత స్కాట్లెండుచేరుసరికి విమానముతగులబడిపోవుటయు, హెస్ గారుపారషూటులో దిగుటయు ఇదివరకుతెలిసిన వార్తయే దిగినపుడుఅతని కాలిచీలమండవిరిగినది. బ్రిటిషుమిలిటరీఅధికారులువచ్చి హెస్ గారినిఆస్పత్రిలోచేర్పించి చికిత్స చేయించిరి. ఆస్పత్రికి బ్రిటిషువిదేశాంగ శాఖలోనుండేఅధికారులుపోయి హెస్ గారితో సంభాషించిరి. అందులోకర్క్‌పాట్రిక్ గారు ఒకముఖ్యులు. ఆసంభాషణవివరములను వారు ప్రచురణ శాఖమంత్రికి తెలియ జేసిరి. హెస్ గారికితగిలినదెబ్బ స్వల్పమైనదియైనందున వారినిఇపుడునాజీఖైదీగా ఒక బాగశాలలోనుంచి బ్రిటిషుసైనికాధికారుల నచట కాపలానుంచినారు. అక్కడవారుపత్రికలు, నవలలు చదువుకొనుచును, వారికిచ్చినకాగితములపై వ్రాయుచును కాలక్షేపముజేయుచున్నారు. ఎక్కువకాలము ఏదోవ్రాయుచుందురట.

హెస్ గారు స్కాట్లెండులోవిమానశాఖ ఉద్యోగంలోఉండే హామిల్టన్ ద్యూకు గారినిచూడ గోరగా, ప్రభుత్వమువారు అద్యూకు గారినిహెస్ గారివద్దకుపంపించిరి. వారిరువురిసంభాషణ ౧౨వ తేదిజరిగెను. ఆసమయంలోఖుఫ్యాఅధికారులును ప్రభుత్వ విదేశాంగ శాఖాధికారులును గమనించుచుండిరి. హామిల్టన్ ద్యూకు గారుతర్వాత తాముమాట్లాడినవిషయాలను ప్రచురణ శాఖమంత్రికి తెలియబరచిరి. ప్రచురణశాఖమంత్రి హెస్ గారితో సంభాషణలనన్నిటిని ప్రధానమంత్రి చర్చిలుగారికివ్రాసి నివేదించినారు.

హెస్ గారుఎందుకుగాను స్కాట్లెండులోదిగిరిఅనుప్రశ్నపై పత్రికలలోఊహాలు అపరిమితంగాజేయబడుచున్నవి. జర్మనీయిపుడు జరిపించుచున్నయుద్ధము హెస్ గారికిష్టములేక వారుబ్రిటనుతోచేర శాంతిసాధించుటకైవచ్చిరని కొందరిఊహ. దీనికిగట్టిఆధారాలేవీకనబడవు. జర్మనులుఅతనికి మనస్థిమితములేక విమానంలోఎగిరిపోయి, పెట్రోలుచాలనందువలన స్కాట్లెండులోదిగవలసివచ్చినదనిప్రకటించినారు. కాని హెస్ గారినిపరీక్షించిన బ్రిటిషుడాక్టర్లుఅతనిమనస్సు ఏమిచెడలేదనిఅనుచున్నారు. కానిజర్మనీలోమాత్రము హిట్లరు గారుఅతనిని విమానంలో .. నిచ్చినందుకును, పోయ్యేసంగతినిముందుగా తనకు తెలియజేయువందుకును హెస్ గారి అడ్జుటెంట్లును అరెస్టుచేయవలెనని ఆజ్ఞాపించినారు. ఇపుడు నాజీపార్టీనంతా శుద్ధిచేయవలసినదిగ హిట్లరుఆజ్ఞాపించినాడుట. ఇపుడుజర్మనీలో హెస్ గారితోకూడ ఎప్పుడుసుతిరుగుచుండువారలను వారలున్నస్థానాలనుండి ఎక్కడికినికదలకుండ హిట్లరుగారుఆజ్ఞాపించినారట. విదేశములరేడియోలనుండి హెస్ గారినిగూర్చిచెప్పబడే సందేశములనుజర్మనులు వినకుండ కట్టుదిట్టముచేసినారట. ఇదివరలోనాజీలతో చాలదగ్గఅపరిచయముకలిగి, ఇపుడునాజీప్రతిభూలోద్యమమునందుసంబంధముగల ఆటోస్ట్రాసరిఅనువారు మే ౧౬వ తేదిన మాంట్రియల్ లో డెయిలీటెలిగ్రాఫు పత్రికప్రతినిధితోసంభాషించుచు గోడింగు అధికారానికిరాగానే నాజీపార్టీని కూలద్రోయవలెననిచూచుచున్నాడనియు, అపుడు హిట్లరు పక్షీయులనుగ తెల్పున్న, హిట్లరునతుపాకితో కాల్చి.. .పమన్నారనియు, అందుచే హెస్ గారు భయపడి బ్రిటనుకుపారిపోయివచ్చి నాడనియు చెప్పినాడు. నాజీపార్టీలో కలతలుబయలుదేరినవని అమెరికాపత్రికలు ఊహించుచున్నవి. కాని బ్రిటనులో కార్మికశాఖమంత్రియగు బెవిన్ గారు లండనులో మే ౧౪వ తేదిన ఉపన్యసించినపుడును, యుద్ధానికిముందు జర్మనీలోబ్రిటిషురాయబారిగనుండిన నెవిల్ హెన్డర్సన్ గారు మే ౧౬వ తేదిన ఉపన్యసించినపుడును, హూం సెక్రెటరీఅను హెర్బర్టుమారిసన్ గారు మే ౧౭వ తేదిన ఉపన్యసించినపుడు హెస్ గారు పక్కాక్రూరనాజీసిద్ధాంతములు చక్షుర్గోచరస్వరూపము అనుభావమును వెలిబుచ్చినారు. హెస్ గారితోశాంతిసంబాషణలు చేసేది లేనేలేదని బెవిన్ గారన్నారు. జర్మనీరహస్యాలను బ్రిటిషువారికి తెలుపుటకై హెస్ గారువచ్చియుండలేదని గట్టిగానమ్మవచ్చునని హెండర్సన్ గారుచెప్పినారు, ఇకచర్చిల్ గారు బ్రిటిషు పార్లమెంటువారికి ఏమిప్రకటించెదరో చూడవలసి యున్నది.

### ఇరాఖులో జర్మనువిమానాల దెబ్బలు

ఇరాఖులోఅప్పుడే జర్మనువిమానాలు ప్రవేశించిఅక్కడచేరియున్న బ్రిటిషు విమానములపై దాడులనుగూడచేయుచున్నవి. హబ్బానియాలో బ్రిటిషువిమానాలుఉన్నచోటిపై మే ౧౬వ తేదినజర్మనువిమానాలదాడులవల్ల కొద్దినష్టముకలిగినది. ఇరాఖువిమానాశ్రయములయందు ఇటాలీయ విమానములుకూడవచ్చిచేరినవి. ఇరాఖువిమానాలనునడుపుటకు రష్యావైమానికు వచ్చుచున్నారని ఒకవదంతివ్యాపించగా రష్యాలోని మాస్కోరేడియోప్రకటనలో అదిఖండించబడినది. జర్మనుటాంకులు, తేలికైనయుద్ధసామగ్రి ఇరాఖుకు సిరియామీదుగా వచ్చుచున్నవని ఒకవార్తవచ్చినది. కానిఅంకారాలో ఒకజర్మనుఅధికారి యుద్ధసామగ్రినిగొనిపోవుచుండిన జర్మనువిమానాలు సిరియామీదుగా ఇంతవరకుపోలేదని మే ౧౬వ తేదిన అంకారారేడియో ఒకఅమెరికను వ్యాఖ్యాతచెప్పినాడు. బాల్ బెక్ లో ఫ్రెంచివారి స్టోరులనుండి ౮౦౦ టన్నుల యుద్ధసామగ్రి ఇరాఖులోని బాగ్దాదునగరానికి పంపబడినదనియు, జర్మనువిమానాలు బెరూట్, రాయక్, అలెప్పో డమాస్కసులలోదిగినవనియు. ఒక్క ఉదయమే మెజీలో విమానాశ్రయమునందు ౧౫ విమానములుదిగినవనియు మధ్యప్రాచ్య ప్రాంతములో డీ గా ల్ ప క్ష పు ఫ్రెంచిప్రతినిధియగుజనరల్ కాట్రూగారు మే ౧౬వ తేదిన కెయిరోలో ఒకబ్రాడ్ కాస్టుఉపన్యాసములోచెప్పిరి. మెసపటేమియాలోజర్మను, ఇటాలీయసేనలు యుద్ధముచేయుననికూడ వారుచెప్పి, సిరియాలో ఫ్రెంచివారలందరును ఈజర్మనులను అక్కడినుండి తరిమివేయుటకు యత్నించవో తాను తనస్వతంత్రఫ్రెంచిసేనలతో తోడ్పడగల అబ్రాడ్ కాస్టు ఉపన్యాసములోచెప్పిరి. మెసపటేమియాలో జర్మను,ఇటాలీయసేనలు యుద్ధము చేయుననికూడ వారుచెప్పి, సిరియాలో ఫ్రెంచివారలందరును జర్మనులను అక్కడినుండితరిమివేయుటకు యత్నించుచో తాముతన స్వతంత్రఫ్రెంచిసేనలతో తోడ్పడగలనని ఆబ్రాడ్ కాస్టు ఉపన్యాసములో విన్నవించినారు.

బ్రిటిషువారుకూడ భారతదేశమునుండి ఇంకా ఎక్కువసేనలను తీసికొనిపోయి ఇరాఖులోను, హబ్బానియాలోను చేర్చినారు

ఇపుడు హబ్బానియాలోను, బ్రాంతాలోను సేనలపోరాటములులేక శాంతముగా నేయున్నది, బాగ్దాదులో మామూలుగా టెలిగ్రాములు మున్నగునవినడచుచుండుటలేదు. అందువల్లఅక్కడిసమాచారము సరిగా తెలియుటలేదు. రాషిదలీగారిపక్షపువిప్లవకర్తలు హబానియానుండి బాగ్దాదుకు పారిపోవు మధ్యమార్గమందు నదులపై వంతెనలనుకొట్టినారు. నదులకట్టలనుకొట్టివేసినారు. బ్రిటిషువారివిమానాలు రాషిదలీగారిసేనలను, యుద్ధసామగ్రిని ఇంకను తమవిమానాలదాడులచే నాశముచేయుచునేయున్నవి. ప్రతిరోజునుఅక్కడిదాడిలవిమానాశ్రయములను, బండ్లను, పెట్రోలు ఖజానాలను, సేనలనివాసములనుఈవిధముగానష్టపెట్టుచున్నవి. బ్రిటిషువిమానాలు రాషిదలీగారిపక్షపువారిని ఇరాఖునుండి తరిమివేయవలసినదను ప్రచారముగలకరపత్రములను ఇరాఖు ప్రజలకు వెదజల్లుచున్నవి,

బ్రిటిషువిమానాలు సిరియాలో జర్మనువిమానాలుదిగినచోటులపైకూడ దాడులుచేసినవి. పల్మైరా, డమాస్కస్ రాయక్ అను మూడుచోట్ల జర్మనువిమానములుదిగియుండెను పల్మైరాలో కనీసము మూడుజర్మనువిమానాలైనను చాలాదెబ్బతినియుండునని బ్రిటిషువారనుచున్నారు. గ్రీసులో జర్మనులాక్రమించియున్న ప్రదేశాలపై గూడ బ్రిటిషువిమానాలు బాంబులనువేసినవి.

సిరియాఫ్రెంచివారిది. సిరియాలోకి జర్మనువిమానములను ఫ్రెంచివారు ఎందుకురానీయవలెనని చేసినఆక్షేపణఫ్రెంచివారు బేరూటులో బ్రాడ్ కాస్టులో సమాధానమిచ్చుచు జర్మనువిమానాలు విధిలేకదిగవలసివచ్చినదనియు, అవివెంటనేవెళ్లిపోవుటకు తగినచర్య గైకొనబడుచున్నదనియు అందువల్ల ఆజర్మను విమానాలుండినప్రదేశముపై బ్రిటిషువిమానాలు బాంబులనువేయుట న్యాయముకాదనియు ఆరేడియోలో ప్రకటించబడినది, ఫ్రెంచిప్రభుత్వమువారి ఆక్షేపణను బ్రిటిషుప్రభుత్వమునకు సిరియాలోని ఫ్రెంచి హైకమిషనరు గారిద్వారా అందజేయబడినది.

రాషిదలీ ప్రభుత్వమువారు. రాజకీయఖైదీలనందరిని వదలివేసినారు.

సిరియాలో ఇంకను జర్మనువిమానాలువచ్చిచేరుచున్నవి.

### ఇరానుసరిహద్దువద్ద రష్యాసేనలు

ఇపుడు రష్యావారసేనలు ఇరానుసరిహద్దువద్ద తాష్కెంటు ప్రాంతమందుచేర్చబడినట్లు ఒకవార్తవచ్చినది. ఇరాఖు, ఇరానులప్రాంతంలో రష్యా, జర్మనీలు కలిసి ఏకంగాఏదైననుచర్యగైకొనునాయనిపత్రికలవిలేఖకులు ఊహించుచున్నారు. నల్లసముద్రంలోని రష్యానౌకలలో యుద్ధసామగ్రిని రష్యాదీవులకుచేర్చి, అక్కడినుండి ఇరాన్, ఇరాఖులకు చేర్పుటకుమై జర్మనుఅధికారులు రష్యావారితో రాయబారములు సాగించుచున్నారట

మొత్తముమీద ఇరాఖుపరిస్థితినిగూర్చి ఆస్ట్రేలియా తాత్కాలికప్రధానియగు ఫాడెను గారు మే ౧౬వ తేదినాటి ఒకప్రకటనలో అక్కడ రాషిదలీ గారిసేనలు హబానియాలునిలచి బ్రిటిషుసేనలతోపోరినవనియు, ఈలోగా జర్మనులసహాయము ఇరాఖువారికిలభించుటకు మంచిఅవకాశము చిక్కినదనియు సిరియాగుండా జర్మనువిమానాలను ఫ్రెంచివారుపోనిచ్చుటచూడగా, మధ్యప్రాచ్యమునకును, ఉత్తరఆఫ్రికాకును యుద్ధమువ్యాపింపజేయుటలో ఫ్రెంచివారు జర్మనీతోకలిసి కుట్రచేసిరని యెంచవలసివచ్చుచున్నదనియు చెప్పినారు.

ఇటీవల రాషిదలీగారి ఆర్థికమంత్రి ఇబ్రహీమ్ సౌదురాబుతోమాట్లాడగా, ఇబ్రహీమ్ సౌదు గారు తాను రాషిదలీగారివిధానమును అంగీకరించినచో ఇదివరకే తోడ్పడియుండెడివాడననియు, ఇపుడు అరబుజాతులకు బ్రిటనుతోడ్పడుట మొక్కటే దయసాధ్యమనియుచెప్పినట్లు ఒకవార్త వచ్చినది దినిజమెంతో తెలియదు.

మే ౧౭వ తేదిన విషిలో ఫ్రెంచి ప్రభుత్వమువారు .. వించినసమావేశములో తమరాజ సామ్రాజ్యములు .. ..కుండ స..కొనుటకై తమునుఓడించినజర్మనులతో సహాయముపొందవలసిన నిర్మాణమునందుతాము సహకారము చేయుచున్నమంతమాత్రముచేత బ్రిటనుమీదికిఫ్రాన్సు యుద్ధమునకుదిగుననితలచరాదని చెప్పబడినది. ఇది రూజ్వెల్టుగారిఆక్షేపణకు సమాధానముగచెప్పబడినమాట.

ఇరాఖుకుసిరియాగుండా రైలుబోటమీదుగా రైలుబండ్లనిండాగా యుద్ధసామగ్రి పోవుచున్నదట. సిరియాలోఫ్రెంచిఅధికారులు సిరియాప్రజలనుఅరబ్బులను వాలంటీర్లుగాచేర్చుకొని రషీద్ అలీగారిసహాయార్థమై ఇరాఖుకు మోటారులారీలలోతీసికొనిపోవుచుండగా సరిహద్దువద్ద బ్రిటిషువారివిమానాలుఆలారీలపై బాంబులను వేసినట్లు వార్తవచ్చినది.

ఇరాఖుబ్రిటనులపోరును తీర్చుటకుమధ్యవర్తిత్వముచేయవలసినదని తుర్కీలోనిఅమెరికను రాయబారిరూజ్వెల్టుగారికి విజ్ఞప్తిచేసినాడట.

### తుర్కీవ్యవహారము

జర్మనులిపుడుతుర్కీని ఆర్థికసౌకర్యముల నీయవలెనిదని ఒత్తిడిచేయుచున్నారు. ఉదాహరణార్థము, జర్మనులుగ్రీసుపైదాడికినపుడు మారిట్జారైల్వేవంతెనను చెడగొట్టియుండిరి. ఇపుడుజర్మనులఆవంతెనను బాగుచేయించుటకు కావలసినసామానునంతయు తాముపంపెదమనియు, తుర్కీవారుపనిమనుష్యులను పెట్టిపనిచేయించవలసినదనియు తుర్కీనిఅడుగుచున్నారట. ఈవిధంగాతుర్కీవారు జర్మనీకిఆర్థికసౌకర్యములను ఇచ్చినచోజర్మనులు తుర్కీగుండాజర్మను సేనలపోనీయవలసినదిగా కోరరనియు, బ్రిటిషువారినుండిక్రీటును, సైప్రసునుపట్టుకొనినతర్వాత ఆ మార్గమునతమసేనలను పంపించగలరనియుజర్మనులనుచున్నారు. తుర్కీలోఇపుడు ౨౦ఏండ్లకు ౪౫ ఏండ్లకు మధ్యవయస్సుగలముసల్మాను పౌరులను ఇంతవరకుసేనలోకి పిలువబడనివారిని ఇపుడుపిలుచుచున్నారు.

ఒకగొప్పతుర్కీఅధికారి రష్యాతోఒకక్రొత్త ఒడంబడికను చేసుకొనుటకై మాస్కోకుపోవుచున్నాడట. యుద్ధమువచ్చినచో జర్మనీనల్ల సముద్రముమీదుగా యుద్ధమునకు దూకగలదనియు, సామ్సనులో సేనలనుదింపుటకును త్రేసుగుండాను,అనటోలియాగుండాను దాడిసలిపెదరనియు అంకారాలోసైనికవర్గాలతో సంబంధమున్నవారలు తలచుచున్నారు.

### యుగోస్లావియా

పాశ్చాత్యమున ఆప్రాంతంలో ఎక్కడనోఉండే ప్రాతయుగోస్లావియారాజగు పీటరు గారిని కెప్టన్ రూజ్వెల్టు అనువారు మే ౧౬వ తేదిన దర్శించి సంభాషించగా, పీటరుగారు వారిని యుగోస్లావియావిమానదళముకు పునర్నిర్మాణముచేయుటకై అమెరికావారు విమానములను పంపగలరాఅంఅడుగగా రూజ్వెల్టుగారు ఓ,మీరడిగినన్ని అని జవాబుచెప్పిరట. యుగోస్లావియాలోజర్మనులుస్థాపించిన క్రోషియా రాజ్యముయొక్క ఉన్నతాధికారియగు పావెలిష్ గారు మరికొందరితోగూడ ఇటలీకిపోయి ఇటలీరాజగు విక్టర్ ఇమాన్యువల్ గారిని సేవాయ్ వంశీయుడగు ఒక రాజకుమారుని క్రోషియాకు రాజుగానుండుటకు చెప్పవలసినదనికోరిరి. అందుకు స్పోలిటోడ్యూకుఅగు ఆయమేవ్ రాబర్ట్ గారిని ఏర్పాటుచేసినారు-ఇతనివయస్సు ౪౧. ఇతడు అబిసీనియాలో ఇటలీవైస్రాయియగు అయోస్టాడ్యూకు గారి కనిష్ఠసోదరుడు

క్రోషియాలో రాజద్రోహముపురికొల్పే పత్రములను ప్రకటించినందుకును, సమ్మెలుకట్టినందుకును మరణదండనశిక్ష విధించబడునని శాసనము చేయబడినది, జర్మనీకి క్రోషియానుండి ౫౫౦౦౦ మంది కార్మికులనుపంపవలెననియు, దానికిబదులు జర్మనీనుండి ఎరువులు .. .. పంపించెదమనియు జర్మనులుకోరగా క్రోషియానుండి ఇటలీకి వచ్చి.. .. అంగీకరించినారు. జర్మనీకిని క్రోషియాకును వాణిజ్యసంబంధముకు నెలకొల్పుటకై క్రోషియాలోనిజాగ్రెబ్ కు జర్మనీనుండి డాక్టరు క్లో.. గారు మే ౧౫వ తేదిన చేరినారు. వియన్నాలో ఇటాలీయప్రతినిధులు, క్రోషియా ప్రతినిధులుగల ఒకవాశ్వత సరిహద్దు సంఘం స్థాపించబడినది.

### గ్రీసువ్యవహారము

గ్రీకుసేనలలో కొన్నిముఖ్యదళములు ఇపుడు పాలెస్టైను ఆప్రాంతములోచేరియున్నవట

గ్రీసులోనుండి ఆఖరుబ్రిటిషుపార్టీ ఇపుడే అలెగ్జాండ్రియాకుజేరినట్లు వార్తవచ్చినది. వారిఓడ ప్రయాణముజేయుచుండగా మార్గమున అక్కడక్కడ జర్మను విమానములు వారిపైబాంబులను వేసి తరిమితరిమికొట్టినవట. వారుమధ్యలోశరిఫాస్ దీవిలోదిగినపుడు ఆదీవిజర్మనుల ఆంత్యసందేశమునకు బెదరి లొంగిపోవుటకు నిర్ణయించుకొనగానే, బ్రిటిషువారు ఆదీవినివదలిలేచిపోయిరి. గ్రీకు ఆర్థికమంత్రియు, న్యాయశాఖమంత్రియుసముద్రమార్గముమీదుగా పైపాడీవికిజేరినారు, మార్గములో జర్మనువిమానములనుండి వారలపైతీవ్రమైనదెబ్బలుప్రయోగించబడినవి. అదృష్టవంతులైనందువల్ల ఆగ్రీకువారలు గాయాలులేకుండా తప్పించుకొని దాటుకొన్నారు.

## ఖాన్గీబళ్ల సంఘము

హైదరాబాదురాష్ట్రములో చాలఖాన్గీబళ్లున్నవనియు వీటికిఒకకేంద్రసంస్థలేనందున కొన్నిచోట్లకొన్నిబాగుండి అడిగేవారులేక మొత్తముపై మంచిస్థితిలో లేవనిఆలోచించి ఇటీవలజరిగిన ప్రజావిద్యామహాసభలో ఒకకేంద్రసంఘ స్థాపనకై కొందరు నాయకులేర్పడినారు శ్రీధరనాయకు గారుఇంతలోఖాన్గీబళ్లను నడుపువారినందరిని పిలిపించిసభచేసి కొన్నినిర్ణయములుచేయనున్నారట.

# అనల్ మలిక్ అని మేమంటిమా మరి?

## అది ఉపమానం మాత్రమే!

—

సమన్వయ ప్రయత్నము

హైదరాబాదు(దక్కన్), తీరుగర ...సర్ అనే పెద్దమనిషి "అనల్ ఫ్మన్ (అహంబ్రహ్మ) అన్నాడ ంమతవిరుద్ధం-అందుచేత అతనిశిక్షి ంచేసినారు. అది మతసంబంధం రాజ ...గా హైద్రాబాదులో ఒక "రాజకీయ ..." (రాజకీయముస్లిం గాయత్రి) "అనల్ మలిక్" నేనేరాజును అనే సిద్ధాంతము బయలుదేరె ను. రాష్ట్రములోని గలితముల ముస్లిములంతా అనల్ మలకులైతేమిగతవారో!......ఈసిద్ధాంతము చాలాదూరంపోయిందని ప్రభుత్వంవారొక ప్రకటనకావించిరి. అదియిదివరకే ప్రకటితం. దానిపై ౧౧ మే నాడు ఇత్తెహాదుల్ ముస్లిమీన్ యొక్క అంజామన్ వారు రెండు దినాలు ఆలోచనచేసి ఇటు పత్రికా ప్రకటనముచేసినారు.]

ప్రభుత్వంపైన ఏమిన్ని తప్పులొపుట మా మజ్లిసు అభిప్రాయముకాదు. మజ్లిసు యొక్క ఉద్యమము కొన్ని అంశాలపై ఆధారపడి యున్నది. మజ్లిసుయొక్క కొన్ని వాక్యాలకువిరుద్ధముగా ప్రభుత్వమువారు ప్రకటించుట మజ్లిసుకు విచారము కలిగించినది. మజ్లిసువారు ప్రకటించిన ప్రకటన లోని భావాలను ఒకవిధముగా ప్రభుత్వము వారు స్పష్టపరిచినారు. అయ్యంగారు కమిటీవారు తమ కిచ్చినఅధికారాలనుమించి ఒక ప్రజారాజ్యపద్ధతి ని వెల్లడించియుండిరని ప్రభుత్వమువా రంగీకరించుచున్నారు. ప్రభుత్వమువారును ౧౩౫౦ ఫసలీ ... ఫసలీ నాడు కమిటీ నిరూపణమును అంగీకరించి జరీదాలో ఇట్లుప్రకటించియుండిరి, ... పారినిధ్యమెట్టిదైననుసరే, మ.ఘ.వ. నిజాంప్రభుగారు ప్రజలందరియొక్క ఉత్తమ ప్రతినిధి" అని ప్రకటించిరి. అనగా ప్రభువుగారిఅధికారాన్ని ఒకటిన్నరకోటిప్రజలపై విభాగించేను మజ్లిసువారు రాజ్యాంగసంస్కరణలు ముసల్మానులకు తృప్తికరముగాలేవని నిర్ణయించి ౧౩౫౦ ... ౧౩ఆ నాడు ప్రధానమంత్రిగారితో మాట్లాడిరి, దానిఫలితముగా ప్రభుత్వపక్షమునుండి ౧౩ బహమన్ ౧౩౫౦ ఫసలీనాడు మామజ్లిసు ప్రతినిధికి జవాబియ్యబడెను. ఆజవాబుమువ్చటను ప్రభుత్వమువారు మొన్న జరీదాలో చేసినారు. అందిట్లున్నారు.

"మ.ఘ.వ. ప్రభువుగారిఅధికారాలు వారికి సహజముగానే వర్తించునవై యున్నవి. మరియు తప్పుఅభిప్రాయముకలుగకుండునట్లుగా రాజ్యాంగశాసనమును ప్రవేశపెట్టునప్పుడు స్పష్టముచేయబడును"

దీనినిబట్టి మొదట ప్రభుత్వమువారు బాధ్యతాయుత ప్రభుత్వముయొక్క పునాదిఅయిన ప్రజాపరిపాలన ఏర్పాటును ఒప్పుకొనియుండిరని విశదమగుచు.

మజ్లిసువారు దీనికివిరుద్ధముగా ఆందోళనము చేసిరి-అందుపై ప్రభుత్వమువారు మజ్లిసువారి తర్కాన్ని ఒప్పుకొని రాజ్యాంగశాసన ప్రకటనపైన ౫ నెలలతర్వాత తమఅభిప్రాయముయొక్క మార్పును ప్రకటింతుమనిరి. ఆటుతర్వాత ప్రధానమంత్రిగారు తమ ఉపన్యాసములోను నేషనల్ కాన్ఫరెన్సుకు సెలవు నిరాకరించునప్పుడు బాధ్యతాయుతప్రభుత్వానికి కఠినముగా ప్రాతికూల్యతను వెల్లడించినదినిజమే.అయితే యథార్థమేమనగా స్టేటుకాంగ్రెసువారు బాధ్యతాయుతప్రభుత్వముయొక్క నియమాన్ని స్థిరముగా నేతుంచుకొని కేవలము పేరుమాత్రము మార్చుకొనిన దాని అస్తిత్వమునకు అంగీకరించియుండిరి. అప్పుడు మజ్లిసువారి ఆందోళనముయొక్క కారణముచేతనే బాబేహుకూమతువారు విధాయకము లేనివారై ఈనాడు ఏవిషయాన్నిగురించి ప్రభుత్వమువారు గర్వించుచున్నారో ఆవిషయమునకు మూలమైన జవాబు నిచ్చిరి.

మొత్తముపై మజ్లిసువారు ప్రభుత్వమువారి ౨ తీరు ౧౩౫౦ నాటిప్రకటనలో బాధ్యతాయుతప్రభుత్వవిరుద్ధముగా ప్రభుత్వముయొక్క పాలిసీని స్పష్టపరిచినందులకు సంతృప్తిని వెల్లడించుచున్నారు-కాని ప్రభుత్వప్రకటనలో కొన్ని విషయాలింకను స్పష్టముకావలసియున్నవి- ఉదాహరణార్థము మజ్లిసుయొక్క అధ్యక్షుడు చెప్పిన కొన్ని మాటలిటీవలివన్నారు-కాని మూడేండ్లనుండియు ఈఅభిప్రాయాలు వెల్లడింపబడుచునే వచ్చినవి-చిత్రమేమనగా ప్రభుత్వానికిని మజ్లిసునకును జరిగిన పత్రవ్యవహారములలోని కొన్నిరహస్యములను వెల్లడిచేసినారు-కాని ప్రభుత్వమువారు వాటిని రహస్యముగా ఉంచవలసినదని మాకుమాత్రము ఆజ్ఞయిచ్చియుండిరి- ముస్లింప్రజలు ఎన్నియోమారులు వాటిని తెలుపుమని కోరినను మేము వాటిని బయటపెట్టక పోయితిమి- ఇప్పటి పద్ధతినిచూడగా ప్రజలలో పొరపాటు అభిప్రాయముకలుగకుండునట్లుగా ఆ పత్రవ్యవహారాన్నంతయు ఎందుకు ప్రకటించగూడదుఅని మజ్లిసు ఆలోచన చేయుచున్నది-

౫తీరునాడు సుబేదక్కన్‌లో ప్రకటితమైన ఒకప్రకటనను మజ్లిసువారుగమనించినారు- (అది కొందరు మూర్ఖులుచేసిన అనల్ మాళిక్ సిద్ధాంత ఖండనము ఈపుస్తకలో ప్రకటితమైనది గోప్య) ఆప్రకటనలు సంతకాలు చేసినవారి సమక్షములోనే ఒకమారుకాదు అనేకమారులు మజ్లిసుయొక్క ఉద్దేశాన్ని బలపరుచుచు మజ్లిసుఅధ్యక్షుడు తనఅభిప్రాయాలను వెల్లడించియుండెను- దానిని సంతకాలుచేసినవారు ఆ సిద్ధాంతాన్ని ముసల్మానులందరిచేతను మాటిమాటికి అనిపించినారు- "మేముపాదుషాలము"అని సభాధ్యక్షుడు అనుటలో గలితముల ముసల్మానులలో ప్రతివాడును పాదుషాయేఅనికాదు- అట్లు సంభవముకూడా కాదు-ఈరాష్ట్రానికి అసఫ్జాహీవంశమువారుకాక ఇతరులు పాదుషాలుకాగలరా? మా మజ్లిసులోని యేసభ్యునిమనస్సులోను అపవిత్రమైనభావన యొవ్వడునుకలుగలేదు-అందరికిన్ని మనసులో ఎక్కునట్లుగాచేయుటకై ఈసిద్ధాంతమునిర్వచింపబడియుండెను-దానిభావమేమనగా "ముసల్మానులయొక్క రాజకీయసంస్కృతుల సంబంధమైన అధికారముయొక్క బాహ్యస్వరూపము మ-ఘ-వ-నిజాంప్రభువుదే"అనిమాఅభిప్రాయం,మరియు ఈప్రభుత్వము ఒకఇస్లామీప్రభుత్వమైయున్నది-"అనల్ మలిక్" అనికాని "మేమే తఖ్తుయొక్క కిరీటముయొక్కయు వారసులము"అనికాని మేమెప్పుడునుఅనలేదు- ఎవ్వరైనా అనినను అదిఒక ఉపమానముగానే అనిఉంటారు-

—

## ఖాయదెమిల్లతుకు నరసింగరావుగారి జవాబు

హైదరాబాదు (దక్కన్), తీరు ౧౮ మం. నరసింగరావుగారును మరియిద్దరును ఇత్తెహాదువారినిసంబోధించి ఒకప్రకటనచేసియుండిరి, అందుపై ఖాయదెమిల్లత్ నవాబబహద్దరుయార్జంగు బహదూరు జవాబిచ్చిరి. ఈరెండును ఇదివరలోనే ప్రకటితములు. ఇప్పుడుఖాయదెమిల్లత్ గారికి నరసింగరావుగారొక్కరే యీవిధముగాజవాబిచ్చుచున్నారు. ఈజవాబు ముషీరెదక్కన్ నుండి తర్జుమాఅగుచున్నది.

"ఖాయదెమిల్లతిటన్నారు మం. నరసింగరావు, రామాచారి రామచంద్రరావులంటూగారలు (హిందువుల) ప్రతినిధులుకారు. ఇదినిజమే ఈ ప్రకటనచేసినవారుఎప్పుడును తమప్రతినిధులమని చెప్పలేదు- వీరుఏరాజకీయసంస్థలోను వాళ్లదాల సభ్యులైనను కారు. అట్టిచో వీరు తమసంఘముయొక్క ప్రతినిధులమని ఎట్లుచెప్పగలరు. కానివీరిలికయొక్కయు దేశముయొక్కయు మేలుకోరువారగుటచేత ఈసమయంలో మరొకమారు రెండుసంఘాలపక్షాన ప్రాతినిధ్యముకలవారు సమాధానపడుటకై ప్రయత్నము చేయుట తమవిధిఅని తలచినారు. అయితే ఖాయదెమిల్లతుగారు తాము కేవలము ముసల్మానుల హక్కులయొక్క ప్రభువుగారిఅధికారములయొక్క యీసంరక్షణవిధిని నెరవేర్చువాడనని చెప్పినారు. మరియు తాను ఏవిధమైనసమాధానవిధానములను సూచింపవాడను కానని యుచెప్పినారు. దీనిఅర్థమేమనగా రెండవసంఘపక్షమునుండివచ్చిన సమాధానసూచనలనుఖండింతుననుట- ఇదివరలోని అనుభవమునుబట్టి కూడాఅట్లేజరిగెను- ఇట్టిసందర్భంలో సమాధానమార్గముకానరాదు-

ఇకప్రభువుగారిఅధికారాల సంరక్షణనుగురించి ఖాయదెమిల్లతుగారు ఏవి, ... నపక్రమకులలో నుకావలసినఅవసరమున్నదని తెలపలేదు.

—

### భాగ్యవంతులు గండు

నిజాంరాష్ట్రమున ప్రకటింపబడు ఏకైక వ్యవసాయసంచిక

## హైదరాబాదు ఫార్మర్

ఇంగ్లీషు, తెలుగు, ఉర్దూభాషలలోకలిసి ప్రకటింపబడును

### దీనికి చందాదారులై

వ్యవసాయాభివృద్ధికి, పైరులకుకల్గు చీడలు, పురుగులబాధలనుండి రక్షించుకొనుమార్గములు తెలుసుకొనుడు. ఎక్కువధనమును సంపాదించుటకు ఎట్టివ్యవసాయపద్ధతుల నవలంబించవలయునో, ఎట్టివిత్తనము లుపయోగించవలయునో తెలుసుకొనుడు.

### హైదరాబాదు ఫార్మరు

తమకు యీవిషయముల నన్నింటిని విశదపరుచగలదు

... పరిజ్ఞానము తమకు ఐశ్వర్యము చేకూర్చును

సంవత్సరముచందా ... రు 3/- మాత్రమే. వి.పి.చార్జిలుకేరు. ఎసోసియేషన్ సభ్యులకు యీ సంచిక ఉచితము. సభ్యత్వచందా సంవత్సరమునకు రు 5/- మాత్రమే

యీరోజే యీక్రింది విలాసమునకు వ్రాయుడు:-

గౌరవకార్యదర్శి,

### హైదరాబాదు ఫార్మింగ్ ఎసోసియేషన్

మ.ఘ.వ. నిజాంప్రభుత్వ వ్యవసాయశాఖ, హైదర్ గూడ, హైదరాబాదు-ద.

## సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా లిమిటెడ్.

1946 సంవత్సరపు 3 o/o డిఫెన్సు బాండ్లు కొనువారికై

సెంట్రల్ బ్యాంకువారి ప్రత్యేకస్కీము.

(1) సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారు 1946 సంవత్సరపు 3% డిఫెన్సు బాండ్లు ప్రకటింపబడినరేటు ప్రకారము యిత్తురు.

(2) బాండ్లకొరకు దరఖాస్తుచేయువారు తాముబాండ్లుకోరిన మొత్తములో ప్రతి ... ను ముందుగా చెల్లింపవలయును. రు. 100 లకు అంతకుపైనగాని దరఖాస్తులు తీసికొనబడును.

(3) తరువాత బాండ్లమొత్తము యీక్రిందివిధముగా చెల్లింపవలయును. మొదటి మూడు నెలలవరకు ప్రతినెల 5 గాని అంతకన్నువగాని చెల్లింపవలయును, మిగతమొత్తము దరఖాస్తుచేసిన తేదినుండి రెండుసంవత్సరములలోగా కొన్ని వారిసౌకర్యాను సారముచెల్లింపవలయును

(4) బాండు విలువనుపూర్తిచేయుటకై చెల్లింపడిన కిస్తుమొత్తములపై బ్యాంకువారు నూటికి 2 1/2 వంతున వడ్డియిచ్చెదరు.

(5) పూర్తిమొత్తముచెల్లించిన తరువాతి బాండ్లుయివ్వబడును.

(6) బాండుమొత్తముపూర్తిగా చెల్లించినతరువాత ప్రతిశత 2 1/2 వడ్డీఆగిపోయి, బాండు యివ్వబడినతేదినుండి సరియైనవడ్డీ చెల్లింపబడును

(7) బాండుయొక్క పూర్తి మొత్తము చెల్లించకనుండే అమ్మదలచినయెడల బ్యాంకువారు దానిని మార్కెటురేటుప్రకారము ఏమియుకమీషన్ లేకుండ సేయిచ్చి దానిపైయింకా చెల్లించవలసినపైకమును పట్టుకొని మిగతపైకమునిత్తురు

హైదరాబాదు-దక్కన్ } మేనేజరు.

...—8—40 } కె. జె., వికాజీ

—

ఉదయము

మధ్యాహ్నము

రాత్రియందు

చంటిపిల్లలకు, చిన్న వయస్కులవారలకు ఉపయోగించుడు.

గ్లాక్సో బిస్కత్తులు మీకు మేలుకలుగజేయును

టీ (టియర్స్)

గ్లాక్సో బిస్కత్తులు

బలహీనమైన బిడ్డలకు

## గ్లాక్సో

బాలామృతము

పుష్టియున్ను, బలమున్ను,

ఆరోగ్యము నిచ్చును

## బా-బా వాటర్

(రిజిష్టర్డు)

తల్లులకు నమ్మకమైనది

పిల్లలకు ప్రీతిఅయినది

పిల్లలనుబలిష్ఠము గచేసి సర్వదా ఆరోగ్యముగ నుంచుటకు దీనిని ఉపయోగించుడు, కడుపునొప్పి, అజీర్ణమును నివారణచేయును. త్రాగుపాలను జీర్ణముచేసి వారి పలువరుస చక్కగా వృద్ధిచేయును.

ఏటు — జి. రోహిల్ బ్రదర్సు

సుల్తాను బజారు, హైదరాబాదు దక్కన్.

Use

Ba-Ba Water The Elixir for Infants

## ఇప్పటూరు

### శ్రీ బసవజయంతి

౧౦-౮-౫౦ ఫ

(ఒక విలేఖరి)

వైశాఖ శు-3 సరియగు చి॥ ౨౯ ఖుర్దాదు సన్ ౧౩౫౦ ఫ. రోజు మంగళవారం తేదినవీర శైవమతోద్ధారకుడగు శ్రీ బసవేశ్వరస్వామి జయంతి మహోత్సవమునగరుజిల్లా యిప్పటూరు గ్రామంలో మఠంవీరయ్యగారియింటియందు జరుపబడి, అలంకరించబడిన స్వామివారిపటమునుపల్లకిలోనుంచబడి సాయంత్రం ౪ గంటలనుండి గ్రామవీథులందుఊరేగింపుచు ౭ గంటలకు శివాలయందగ్గరకుచేరిరి. రాచయ్య ప్రధానోపాధ్యాయులుగారు రచించినగ్రంధమును హాకింకేయంపాగ్వేరయ్య మరియు కంసాలి నరసింగయ్య వీరుభయులు హరికథారూపకము గావినిపించిరి, డి. లక్ష్మీకాంతరావు పట్వారిగారున్ను శ్రీస్వామివారిచరిత్రకొంతవరకు పద్యరూపకముగావినిపించిరి. యన్. మల్లయ్య ఉపాధ్యాయులవారుతదితరసహాయులవల్ల భజనసలిపిరి ముఖ్యముగాయీ ఉత్సవములో గ్రామాధికారులసహితముగాహిందు మహమ్మదీయులనుభేదములేక సుమారు ఐదువందలజనముండిరి వీరందరు మ-ఘ-శ- నిజాం ప్రభువుగారి ఆయురారోగ్యఐశ్వర్యములకై భగవంతునికోర్చి ప్రార్థించిరి. పిదప రా॥ బుధ్ధారెడ్డికేశాయిగారు మిఠాయిపంచిపెట్టిరి.

---

### అష్టావధానము

హన్మకొండ, వృష వైశాఖ బ॥ 3

మా శ్రీ రాజరాజనరేంద్రాంధ్రభాషానిలయమున ౭ తీర్ ౧౩౫౦ ఫసిలీ సాయంకాలము ౫ గంటలకు నిలయసభ్యులచే కోర్పబడిన సమావేశమున శ్రీ బాలబ్రహ్మచార్యులచే అష్టావధానము గావింపబడెను.

ఇక్కవిపరుడు మహాభాగ్యనగరవాస్తవ్యుండు, జాత్యంధుడు, అయ్యుఅవధానవిధులనుసక్రమముగానెరవేర్చి సభ్యులను సంతృప్తులజేసిరి. న్యస్తాక్షరి, వ్యస్తాక్షరి, నిషేధాక్షరియున్ను గుకవిత్వమునకుఆశాయాసముగా నిర్వర్తించిరి. కవిత్వమునకు లక్షణముగానుండెను. ధారాశుద్ధియు బాగుగానుండెను.

ఇట్లు,

గార్లపాటి రాఘవరెడ్డి,

సహాయకార్యదర్శి.

## షర్కీ-తాలూకా ఆంధ్రజనసంఘము

### కార్యకారిణీ సంఘసమావేశము

బీబీనగర్, తే ౧౧-౮-౫౦

షర్కీ-తాలూకా ఆంధ్రజనసంఘతృతీయ కార్యకారిణీసమావేశము బొల్లేపల్లియందు తే ౧౧-౮-౧౩౫౦ గురువారంసాయంత్రము ౫యిదుగంటలకుసమావేశమై ఈక్రిందితీర్మానములు ఆమోదింపబడెను.

శ్రీ రాజమాతయగు బడీబేగం సాహెబగారు పరమపదించినందులకు విషాదము ప్రకటించుచు మహాఘనతవహించిన నిజాంప్రభువరేణ్యుని దివ్యసన్నిధిలోకి ఈసభవారుతమరాజభక్తి పూర్వకమయినహార్దిక సానుభూతిని మనవిజేసుకొనుచున్నారు. ఆంధ్రమహాసభకార్యకారిణీ సభ్యుడగు శ్రీయుతబద్దంఎల్లారెడ్డిగారిని మరియురైతుసేవసంఘ శ్రీయుతపైడిపల్లి హన్మయ్యాచౌదిరిగారిని ఏలాటివిచారణలేకుండానే దిగ్బంధించినందులకు ప్రభుత్వమువారిఇట్టిపాలిసీ పట్లమునఅసమ్మతి ప్రకటించుచువారిపైనుండు నేరములనురుజువు చేయుటకుగానుత్వరగబహిరంగ విచారణ జరుపుటకై ఈసభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

చిలుకూరులోజరుగనున్న అష్టమాంధ్రమహాసభఅద్యక్షతదవికి శ్రీయుత రావినారాయణరెడ్డిగారుదేశీయులచేఏకగ్రీవముగా ఎన్నుకోబడినందుకీసభవారుహర్షపూర్వకముగా శ్రీరెడ్డిగారిని అభినందించుచు శ్రీరెడ్డిగారి అధిపత్యమున ఆంధ్రమహాసభదేశీయులకు ఇటువంటిక్లిష్టపరిస్థితులయందు అభివృద్ధిపూర్వకమగు దారిచూపించగలదని ఈసభవాశించుచున్నారు.

---

### ఒకరికిహక్కుండే భూమిమరొకరికి దానము

భువనగిరి, ౧౧ తీరు ౧౩౫౦ ఫ

స్థానికవంజరివాడ రాహులీ (వంజరివాండ్ల) ఇండ్లకంపౌడు (గోషల) ప్రకనకొంతభూమియుండెనుఅట్టిభూమిఇండ్లుకట్టుటకు ఉపయుక్తమైనట్టిది. స్థానిక ప్రభుత్వాధికారులు ఎవ్వరికి తెలుపకుండగ వేశహాకీలు చప్రాసీయగు మంగలిదుర్గప కిరికిఇచ్చికొన్నిమాసములైనట్లు తెలియుచున్నది, కానవరికొవంజరివారికిహక్కుగలిగినట్టిభూమిని వారికితెలుపకుండనే ఒకప్రభుత్వ నౌకరుకులోపలనే ఇచ్చుటఏల?

## శ్రీనారాయణ తీర్థాశ్రమం

(అనమనమూరు అగ్రహారం ఒంగోలు తాలూకా)

మనఆంధ్రదేశంలో చిరకాలముక్రిందట బ్రహ్మశ్రీపుచ్చా వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఈఆశ్రమమునుస్థాపించి సంగీతసాహిత్య గ్రంధసంపాదనము, పరిశోధనలూ, ప్రచారప్రబోధములుకొనసాగించుచూపనిచేయుచున్నట్లువింటిని. ఇప్పుడీఆశ్రమయాజమాన్యమున ఏఏసంస్థలుఏవిధముగానడుపబడుచున్నవి? ఈసంస్థలనడుపుటకు ఏదైనాహాలికవర్గమున్నదా? శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారుపలుప్రాంతములకేగి ఈఆశ్రమమునకువిరాళముప్రోగుజేయుచున్నారు ఈమధ్యకళాబోధిని అనుపత్రికనుగూడా వెలువరించుదుమని ప్రకటించిరి. అందువిరాళములు వసూలుచేయుచున్నట్లుగూడా తెలిసికొంటిని ఈఆశ్రమవివరముల ను "కళాబోధిని" ప్రచురణవివరములను వసూలు కాబడినవిరాళములనుఈసంస్థల కెల్లనివియోగించినదిపత్రికాముఖమున వెలువరించినచో సంగీతసాహిత్యకళాభిమానులు కొందరువీటినిజస్థితిని తెలుసుకొని ఆశ్రమభాగ్యాభివృద్ధికై సహాయపడసంసిద్ధులైయున్నారు. కమకసంస్థాపకులైనను వివరములను లోకమునకు వెలువరించుదురుగాక.

ఇట్లు

సంగీతసాహిత్య కళాభిమాని,

టి. గోపాలశాస్త్రి,

అరండల్ పేట,

గుంటూరు,

---













## చందాదారులకు మనవి

చందాదారులు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునపుడు, మనిఆర్డర్లు బంపునపుడు. తమ చందానెంబరు వ్రాయుటయందు తగుశ్రద్ధ గైకొనుటలేదు. చందా నెంబరు వ్రాయనిది వెంటనే జవాబీయుటకు వలనుపడదు కాన చందాదారులెల్ల ముఖ్యముగ గమనింపకోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక.

# కొండపత్రిక

వృషనామ సం॥ర వైశాఖ బ॥ ౧౨

గురువారము


## హైదరాబాదు వార్తావతి

హైదరాబాదు ఇక్ ఫర్మేషన్ అనుదానికి మేము హైదరాబాదు వార్తావతి అను నామకరణము చేసినాము. కాని మన ప్రభుత్వప్రకటనవారేమి నామకరణము చేసినారో మాకు తెలియదు. హైదరాబాదు పత్రికలలో పై పేరుగల మాసపత్రిక ఒకటి ఎక్కువైనది. దానికి మేము స్వాగతమిచ్చుచున్నాము. మే నెల నెలకుగాను మొదటి మాసపత్రిక ఇంగ్లీషులో ముద్రింపబడినది మాకందినది. ౨౦ పుటలలో అరఠావు పరిమాణముగో మంచిదైన తెల్లని కాగితాలలో మంచి అచ్చుతో ఈ మాసపత్రిక వెలువడినది. నిజాం ప్రభువుగారి ముఖచిత్రముతో ముద్దుగాసిద్ధమై వెలువడినది. ఈ దేపత్రికను ఉర్దూలోను, మరాఠీ, కన్నడ, తెనుగుభాషలలోను వేరువేరుగా ముద్రించి వెలువరించినారని స్థానికపత్రికల ద్వారా తెలియుచున్నది. మేము వాటిని చూడలేదు. తెనుగులో మాత్రము ఇంగ్లీషులో నున్నదానిని స్వయముగా పెట్టెను, భాషాంతరము పెట్టినది అనువిషయములను పోల్చి చూడవలెనను అభిలాషకలదు కాని అది మాకులభ్యముకాలేదు.

ఇక్ఫ్రిస్పత్రిక ఇండియన్ ఇక్ ఫర్మేషన్ అను పేరుతో అనేక సంవత్సరాలనుండి ఢిల్లీనుండియు, ఢిల్లీనుండియు వెలువడుచున్నది. అది పక్షపత్రిక. మైసూరులో కొన్నిసంవత్సరాలనుండి ఇదే పద్ధతిపై మాసపత్రిక ఆ ప్రభుత్వమువారిచే ప్రకటింపబడుచున్నది. వాటి నమూనాగా ఈ హైదరాబాదు ఇక్ ఫర్మేషన్ ముద్రితమైనది. వాటవలెనే ఇదియు ఉచితముగా లభ్యమగును వాటివలెనే ఇందలి వార్తలను అందరును తీసుకొనవచ్చును.

ఈపత్రికోద్దేశమునుగురించి ఇట్లువ్రాసినారు "ఇదివరలో ప్రభుత్వమువారు సాధించిన విషయాలలో మంచిశ్రద్ధకలిగించుట, ఎప్పటికప్పుడు కావింపబడు అభివృద్ధులను ముందు కావింపనున్న వృద్ధులను ప్రతిబింబింపజేయుట ఈ పత్రికా స్థాపనోద్దేశము" ఉద్దేశము బాగానున్నది. అయితే యితర విషయాలను చేర్చకుండా కేవలం హైదరాబాదు రాష్ట్రవిషయాలనుమాత్రమే యిందులో చర్చించుచూవుండగలరని అనుకుంటాము. ఇందు ఆర్థికవిషయాలు చర్చింపను తాము అనిఅన్నారు. ఇదిచాలా ముఖ్యము. ఇప్పుడేయే పరిశ్రమలు మనరాష్ట్రములో ఉన్నవో వాటిపట్టికను పూర్తిగా ఇచ్చుట ముఖ్యము వాటివలన ఎందరుంగారముపొందుచున్నారు, ప్రభుత్వమువారు ఆవస్తువులనెంతవరకు కొనుచున్నారు, వాటిని అభివృద్ధిచేసేమార్గాలున్నవా, కొత్త గృహపరిశ్రమలేవేవి స్థాపించవలెను ఇట్టి విషయాలను ప్రకటించగలరు. రాష్ట్రపత్రికలలో ప్రజలకేమైనా యిబ్బందులున్నట్లు ప్రకటితమైన వాటి విషయము లో ప్రభుత్వమువారేమేమి చర్యలవలం బించినారో ప్రతిమాసములోను ఆ వివరణము ప్రకటించుట అవసరమనుకుంటాము. రాష్ట్రపత్రికలలో ఇప్పుడు ౯ దినపత్రికలనిన్ని, 3 అర్ధవార పత్రికలనిన్ని ౮ వారపత్రికలనినిన్ని, ౨ పక్షపత్రికలనిన్ని ౨౬ మాసపత్రికలనిన్ని ౧౮ అడపా దడపా వచ్చేపత్రికలనిన్ని తెలిపినారు. వాటి వివరణను తెల్పితే బాగుంటుంది. ఏయేభాషలలో ఎన్ని పత్రికలు? వాటిచందాయెంత? వాటిప్రకటన స్థానమేది మున్నగువిశేషాలు తెలుపుట బాగుండును.

ఈ పత్రికకు మరొకమారు స్వాగతమిచ్చుచున్నాము.

—

## ఈరానీలు

సూరు నూటాయేభై మంది ఈ రానీలుజట్టుగాచేరినట్లున్ను మొదట హైదరాబాదునగరానికి వేంచేసి మేమంతా బుద్ధిమంతులమేఅని నవాబ్ కొత్వాలు బహద్దరుగారికి తెలుపుకొనినట్టున్నూ, మీరు మంచివారేలని వారు ఒకఅధికారపత్రాన్ని వ్రాసి యిచ్చినట్లున్నూ దాన్నితీసుకొని వారు గ్రామాలపై దండయాత్రచేస్తున్నట్లున్ను పటేలు పట్వారీలు భయపడి హారిజనులు మొదలుకొని అన్నివర్ణాలవారితోను ఇంటింటికితిరిగివారికి "చందాలు" ఇప్పించుచున్నట్లున్ను కొందరధికారులు ఈబుద్ధిమంతులకు ద్రవ్యసహాయము బీదరైతులచే చేయించుచున్నట్లున్ను ముషీరెదక్కను లోవిమర్శించినారు. పయాంలోనువిమర్శ వచ్చిందని ముషీరులోనే చూచినాము పై రెండు పత్రికలకును ఈరానీల దండయాత్రల వార్తలు వచ్చినవనివ్రాసినారు.

అయితేమాకును ఈవార్తలు మూడునెలలనుండి వచ్చుచునేయున్నవి. వచ్చినవార్తలలో కొన్నింటిని ప్రకటించినాము. ప్రకటించినవాటిలోను కొన్ని వాక్యాలనుకొట్టివేసేయేప్రకటించినాము. కొన్నివార్తలనుప్రకటించకనేపోయితిమి. ఆకారణముచేతనోయేమో తర్వాతమా విలేఖకులు ఆవార్తలను పంపుటనుమానుకొనిరి.

మేమీవార్తలనుగురించి కావలెననియే యేమియువిమర్శింపలేదు. ఇప్పుడుస్థానికపత్రికలు రెండువిమర్శించినందువలన మేముఎకొద్దిగా కలమెత్తుచున్నాము. ఈరాష్ట్రములోనికి 'ఏసరిహద్దువారినో రానిచ్చుటయేల' వారుసరిహద్దువారోలేక పేరుమబట్టి ఈరానుదేశము వారో! వేలమైళ్ళదూరమునుండివచ్చుటయేమి' దేశాంతరములో గ్రామాలమీదపడుటయేమి' గ్రామములో అధికమానమువలె వీరుకూటికిపేదలైనహారిజనులనుండికూడ దండుగలు బలవంతముగాభయపెట్టి వసూలుచేయుట యేమి? వీరిని వెంటనే రాష్ట్రముహద్దుల దాటించుటతో పనిపూర్తికాదు. వీరినివిచారించి తప్పిదము రుజువైన కొంతకాలము జెయిలుగాలిత్రినిపించి తర్వాతవీరిని రాష్ట్రముపొలిమేర అవతలికిగెంటుట అవసరము. మూడుమాసాలనుండి వీరు ఎన్నిగ్రామాలు తిరిగినారో ఎన్నిదుష్టచర్యలుచేసినారో యేమో?

—

## క్షమాపణ

మేము మాపాఠకులకు క్షమాపణచెప్పుకొనుచున్నాము. మాకార్యాలయంలోని ముద్రణాయంత్రము మునలిదైనది. తటాలున రెండుపండ్లు విరిగిపోయెను. వాటిని సికిందరాబాదులో సరిచేసుకొనుటకు వారందినాలుపట్టెను. ఈ కాలంలో యీరెండుసంచికలను ఇతరత్ర ముద్రించితే ఈఆలస్యమైనది. పోయిన రెండుపత్రికలును ఒక్కొక్క దినము ఆలస్యమగుచు ప్రకటితమయ్యెను. ఇకముందు ఈలోపము కలుగదనిమనవి చేసుకొనుచున్నాము

—

## విదేశ వార్తలు

### అమెరికా ఆశాభంగము

జర్మనీప్రాన్సులకు ఒడంబడికకుదురుటచే, విషీలోనిఅమెరికా సంయుక్తరాష్ట్రముల రాయబారిపిలిపింప బడుటయు, రెండుదేశములసంబంధము తెగిపోవుటయు త్వరలో జరుగునను కొనుచున్నారు. ఇన్నాళ్లుఅమెరికా సంయుక్తరాజ్యము లతనరాయబారిని విషీలో నుంచుటకుకారణము విషీజర్మనీతో చేరకుండ నివారించుటనిమిత్తమే. ఆ ప్రయత్నమిప్పుడు భగ్నమైనది. విషీజర్మనీతోచేరినట్లు రాయబారి జర్మనీవిమానములను పోనిచ్చుచున్నది.

రూజ్వెల్టుగారు మేంగళవారేదిన పత్రికా విలేఖరుల సమావేశములో ప్రశ్నలకు జవాబుచెప్పుచు, విషీవైఖరి ఫలితములనుగురించి తామేమియు చెప్పజాలమనిరి, విషీలోఅమెరికారాయబారిని తొలగించిఅమెరికాఖండములోని ఫ్రెంచివలసభాగములనువిషీప్రభుత్వము జర్మనీచేతిలో పెట్టవలసిచో, ఆదేశములను ఆతిక్రమించుగానే అమెరికా సంయుక్తరాజ్యమును ఆక్రమించునదైయున్న తమ విదేశాంగమంత్రి యోచించుననిరి.

ఎర్రసముద్రములో విదేశనావలు ప్రవేశించినచో, వాటికిఆపాయముకలుగునని జర్మనీచేసిన ప్రకటనకు రూజ్వెల్టుగారిట్లు జవాబుచెప్పిరి. మాదేశముఇదివరకు రెండుమూడు తనవర్తకనావల రక్షణకు యుద్ధనావలను తోడుగాపంపెను. ఒకళ ఖాద్యము క్రిందసముద్రముమీద ఓడలలోవచ్చికొల్లగొట్టువారితో మధ్యధరాసముద్రములోను, కరిబియనుసముద్రములోను మాదేశీయులుపోరి జయించిరి. సముద్రమార్గముమీద మావర్తకనావలను దనకుండ ఇప్పుడుజర్మనీఅడ్డుపెట్టినచో మాదేశముఊరుకొనదు. ఆదేశముతో సంబంధము విడనాడుకొందురా అనితమగ గావుండెటుపోయి ఎటు వచ్చునో తామిట్లు చెప్పగలమనిరి.

### ఫ్రెంచిప్రదేశాల ఆక్రమణ వదంతులు

ఫ్రెంచిగయానాను అమెరికా సంయుక్తరాజ్యసైన్యమాక్రమించినట్లు అప్పుడేవదంతులు బయలుదేరినవి. ఫ్రెంచిదేశములను విషీప్రభుత్వము జర్మనీచేతిలోపెట్టుచున్నదని రూజ్వెల్టుగారుచేసిన నిరోపణయు, ఫ్రెంచిఓడలలోఅమెరికా సంయుక్తరాజ్యసైనికులు కాపుంచబడిరన్నవార్తయు వినివిషీ ప్రభుత్వాధికారులు విస్మయము ప్రకటించుచున్నారు.



విషీకి (అనాక్రమిత ఫ్రాన్సుకు) తెలపరిండుఓడలనిండుగ గోదుమధాన్యమును ఇప్పటికిరిఇకముందునుపంపుదురా అనుప్రశ్నకు రూజ్వెల్టుగారుజవాబుచెప్పలేదు.

### కర్నల్ నాక్సుగారి ప్రసంగము

అమెరికాసంయుక్త రాజ్యనావికాదళ మంత్రి కర్నల్ నాక్సుగారిట్లు చెప్పిరి. విషీప్రభుత్వము తనసొంత విచక్షణప్రకారము గాక జర్మనీఆజ్ఞ ప్రకారంవర్తించుచున్నది విషీజర్మనీలసహకార ఫలితంగా నవదేశమునకిప్పుడు యెక్కువ అపాయముకలుగుచున్నది విషీప్రభుత్వమిప్పుడు లొంగిపోవుటకు కొన్ని కొత్తపరిస్థితులు కారణము

మనముపంపు యుద్ధసామగ్రి ఇంగ్లండుచేరునట్లు మామటునబాధ్యతయని నాఅభిప్రాయము ఇదివరకుయుద్ధములో జలాంతర్గాములభయముమాత్రమేయుండేదిది ఇప్పుడుజలాంతర్గాములు యుద్ధనావలువిమానములుకూడ నావలకుఉపద్రవము కలిగించుటకు సిద్ధముగానున్నవి కొబట్టిఇంగ్లండుకుయుద్ధ సామగ్రిచేర్చుట తేలికైనపనికాదు.

ఇప్పుడుహిట్లరు జయించబడినను, మరిఇరవైఏళ్ళకుహిట్లరువంటి యతను ఇంకొకడుబయలుదేరవచ్చును సామాన్యప్రజలు అభివృద్ధికిపాటుపడి ప్రజాస్వామికపద్ధతిని ప్రపంచములో ఎల్లకాలమునిలువబెట్టుట మనసంకల్పము. యుద్ధానంతరము మనమునౌకాబలమును తగ్గించుకొనుట తెలివితక్కువ. యుద్ధానంతరము ఇట్లుచేయుటవల్లనే ఇప్పుడుఅవస్థలపాలగుచున్నాము, ఆరేళ్ళలోజర్మనీ ప్రపంచమును సవాలుచేయుశక్తినిసంపాదించినది, ఇప్పుడుజర్మనీని అణగద్రొక్కినను మరలఅంఏళ్లలోజర్మనీశక్తివంతమై ఇప్పటియట్లేవిజృంభించవచ్చును. ప్రపంచములోహిట్లరువంటివారు ఎంతమందియోపుట్టిరి. నెపోలియను, జెంగిస్ ఖానుకైజర్లుప్రపంచ సామ్రాజ్యమును ఏలవలెననిహిట్లరువంటిఅభిలాషగలవారే అట్టివాడొకడుమరణించగా నింకొకట్టివాడుమరల పుట్టడనిలోకము భ్రమించియుద్ధసంసిద్ధముగా నుండకపోవుటవల్లనే మాటిమాటికి అవస్థలకులోనగుచున్నది. కొబట్టిఅమెరికాసంయుక్తరాజ్యము తనయుద్ధనావలసంఖ్యను ఈయుద్ధానంతరము తగ్గించుకొనవదు,"

### స్వతంత్ర ఫ్రెంచిపక్షమువారి ఖండనము

విషీప్రభుత్వము జర్మనీతో సహకారముచేయుచున్నందుకు ఇంగ్లాండులోని స్వతంత్రఫ్రెంచిపక్షముఇట్లుప్రకటించెను.

"పెటెయినుగారు తమవాగ్దానమును భంగపరచిరి పెటెయినుగారివంటి దేశభక్తుడు వీరపురుషుడునగు దేశద్రోహులతోకలసి జర్మనీపక్షమునచేరుటయూరు హృదయవిదారకముగానున్నది పెటెయినుగారిప్రభుత్వము (విషీ ప్రభుత్వము) ఫ్రెంచిప్రజలలో అత్యధికసంఖ్యాకులఅభిప్రాయమునకు విరుద్ధముగానడుచుకొన్నది, డార్లను గారును, విషీప్రభుత్వములోని ఇతరమంత్రులును ఫ్రెంచిప్రజల ప్రతినిధులుగారు, వారికిపలుకుబడిలేదు. ఫ్రెంచిప్రజలకునిజమైన ప్రతినిధి స్వతంత్ర ఫ్రెంచిపక్షమే

### ఫ్రెంచినౌకలపై అమెరికా సంయుక్త రాజ్య చర్య

అమెరికాసంయుక్తరాజ్యపు రేవులలోనున్న ఫ్రెంచినావలపై అమెరికాసంయుక్తరాష్ట్రప్రభుత్వమువారు తమసైనికులను కాపుంచిరి.

### కర్నలు నాక్సుగారి ఉపన్యాసం

మంగళవారము అమెరికాలో వాషింగ్టను నగరమందు మిలిటరీఇంజనీర్లసొసైటీలో సోమవారంరాత్రి అమెరికానౌకాశాఖా కార్యదర్శియగు కర్నలునాక్సు గారిట్లుపన్యసించిరి.

"ఇంగ్లాండుకుపంపబడే సరకులనావలకు అమెరికనుయుద్ధనావలను తోడుగాపంపించడంవల్ల ప్రయోజనంలేదు. అంతకన్నక్రొత్తరకపు యుద్ధనౌకాసాధనములను మనము అందించి ఇంగ్లాండు సురక్షితంగా ఆయుధసామగ్రిని చేర్చవలెను"

జపానుపై ఈడెనుగారి విమర్శ

చైనాలో జపానుఆక్రమించిన భాగములలో విదేశములకున్న వర్తకముకు భంగము కలుగకుండుటకు జపానువాగ్దానముచేసి, ఆవాగ్దానమును భంగపరచినదని పార్లమెంటు కామన్సుసభలో సభ్యులడిగినప్రశ్నలకు బ్రిటిషువిదేశాంగమంత్రియగు ఈడెనుగారిట్లు సమాధానము చెప్పిరి:—

చైనాలో బ్రిటిషువారికిగల వర్తకసౌకర్యము లనుతగ్గించుట జపానుఅదివరకుచేసిన వాగ్దానమునకు విరుద్ధమనియు, ఇట్టివిరుద్ధచర్యకుజపానుప్రభుత్వం బాధ్యతవహించవలసియుండుననియు అనేకమార్లుచెప్పితిని. జపానుప్రభుత్వమునకీవిషయము మెన్నిమార్లుచెప్పినను అత్యుపట్టలేదు.

బ్రిటిషుప్రదేశములలో జపానువారికిగల వర్తకసౌకర్యములనుతగ్గించినందుకు జపాను తెలిపిన ఆసమ్మతికి ఈక్రిందిరీతిగాబదులుచెప్పవలసినదని జపానులోని బ్రిటిషురాయబారియగు సర్ రాబర్టు క్రాయిగీగారికి తెలియబరచితిని:—

'మాప్రదేశములలో దొరకువస్తువులను మా యుద్ధావసరములకవసరమైనంతవరకు మేమే ఉపయోగించుకొనుచున్నాము. అవసరమునకు మించగలవస్తువులను మాయుద్ధమును ఎగుమతిచేయునప్పుడు కూడ అవిశత్రువుకుచేరకుండ జాగ్రత్తపడుచున్నాము. ఇదియేబ్రిటిషు ప్రభుత్వమువారిప్పుడనుసరించుచున్న విధానము. ఆవిధానమునసరించియేపని జరుగుచున్నది. అదిగాక చైనాలో బ్రిటిషువారివర్తకహక్కులను జపానువారు భంగపరచుచున్నంతవరకు బ్రిటిషుప్రదేశములలో జపానువర్తకులకు ఇబ్బందులతో లగించుటకు ఇంగ్లాండుఇష్టపడకపోవుట సహజము.'

మిల్నీగారు:— జపానుపట్లఇట్టినిష్కర్షమైనవైఖరి ఇకముందునుఅనుసరింతురా?

ఈడెనుగారు:— అనుసరింతుము. చైనాలో బ్రిటిషువారివర్తకహక్కులను గౌరవించినంతవరకు బ్రిటిషుప్రదేశములలో జపానువర్తకులకుగల హక్కులను భంగపరుపకూడదని జపాను మొరపెట్టుటకు వీలులేదు.

## దీపాలకు దాపుండవలెను

కరాచీనగరంలో యుద్ధసంబంధమగు శ్రద్ధతీసుకొంటున్నారు. రాత్రిదీపాలకుదాపుపెట్టవలెనని ఆజ్ఞాపించినారు. ఒక్కగొల్ల, దానికివిరుద్ధంగా ఆచరించినాడు అందుచేతవానికి ౫౦రూ॥ అపరాధంవిధించినారు, అపరాధిఅంతమొత్తం చెల్లించుకోలేనని చెప్పినందున ఆరువారాలు జెయిలులో ఉండుమాన్నని అచ్చటికిపంపినారు.

## మలయాకు బ్రిటీషు సైన్యము

ఇంగ్లండునుండి బ్రిటిషుభూసైన్యము, బ్రిటిషు విమానములు, బ్రిటీషుయుద్ధనావలువచ్చి సింగపూరులో కప్పెల్ రేవులో మేనెల౨తేది వచ్చియున్నవి. మదిగేను బ్రిటిషుభూసైన్యములో ఫిరంగుల దళములుకూడకలవు.

ఈసైనికుల దిగిన కప్పెల్ రేవులో అమెరికను నావలు అమెరికానుండి యుద్ధసామగ్రికొనివచ్చి దింపుచున్నవి. ఈ రేవులోదిగిన బ్రిటీషు సైనికుల సంఖ్య చాలఎక్కువగానున్నది,

## ఫిలిప్పైన్ దీవులయెడల అమెరికా వైఖరి

ఫిలిప్పైనుదీవులవిషయమున నిటీవలఅమెరికా వైఖరిలో కలిగినమార్పునుగూర్చి 'రెడ్ స్టార్' అను రష్యాపత్రికలో ఒక వ్యాసమువచ్చినది. ఈవ్యాసములో నిలుచున్నది అంగ్లేయులు, అమెరికావారు కలసిపసిఫిక్ సముద్రరక్షణమునకై సాగించుచున్న చర్యలు వివరింపబడినవి. జపానువారు దక్షిణమునకుతమదృష్టిమరల్చినచో మొదటఫిలిప్పైనుదీవులనుపట్టుకొందురను ఉద్దేశ్యముతోనిదివరకు అమెరికాదేశమువారు ఆద్వీపములరక్షణకై ఎక్కువద్రవ్యము వెచ్చింప నిష్టపడకుండిరి, కాని ఇప్పుడుఫిలిప్పైనులు, సింగపూరు అమెరికావారిరక్షణవిధానములో ముఖ్యస్థలములైనవి. యుద్ధము ప్రారంభమగుచో ఈరెండుప్రదేశములలో అమెరికావారుదక్షిణసముద్రములలో గొప్పనౌకాదళములనుంచవలెనను ఇటీవల బ్రిటిషునౌకాధిపతులును, అమెరికానౌకాధిపతులును సమావేశమైయుండిరి. అప్పుడు మానిలా, బోర్నియో, పోర్టుడార్విన్, సింగపూరులను రెండుదేశములవారు కలిసిరక్షించువిధానము నిశ్చయింపబడెను ఈచర్యలుమాత్రమేగాక, ఫిలిప్పైను దీవులరక్షణమునకై అమెరికానౌకాధిపతులు చాలద్రవ్యమును ప్రత్యేకించిరి. అందువలన అమెరికారక్షణ విధానమునఫిలిప్పైనుదీవులు ముఖ్యస్థానము నాక్రమించుచున్నట్లుస్పష్టము, అనిరెడ్ స్టార్ పత్రిక వ్రాయుచున్నది.

## రూజువెల్టుతో ఆస్ట్రేలియాప్రధాని సంభాషణ

రూజువెల్టుగారు మేనె౯వతేదిన ఆస్ట్రేలియా ప్రధానియగు మెంజీసుగారితో మాట్లాడిరి. మాట్లాడినపిమ్మట పత్రికాప్రతినిధులతో మెంజీసుగారిట్లుచెప్పిరి:-

"మాసంభాషణలో ప్రపంచవ్యవహారాలన్నీ మాట్లాడుకొన్నాము, ఏవో కొలదివిషయాలుమాత్రమే మేముచర్చించలేదు" అమెరికాలోనున్న ఆస్ట్రేలియా రాయబారికూడ అప్పుడు అక్కడనే మెంజీసుగారితోనే ఉండెను. ఇంగ్లాండునుండి అమెరికాకువచ్చిన యీ మెంజీసుగారు చర్చిలుగారివద్దనుండి ఏవిధమైనసందేశమును తీసికొనిరాలేదు.

## జపాను విజయములు

జపానుసైనికదళములు నౌకాదళములుకలిసి కొంటుసుదు అగ్నేయమునసున్న పోక్లోచెచోలనువట్టుకొనెనని జపానుసైనికప్రకటనలోకలదు. చైనాసైన్యము పోక్లోను కలిగియుంటున్నది. పోక్లోను ఇదివరకొకమారు జపానువారుపట్టుకొనినను అంత ముఖ్యమయినస్థలముకాదని ఖాళీచేసిరి మరలఇప్పుడు పట్టుకొనిరి.

దక్షిణపసిఫిక్ రాజ్యముల మీద జపానదండయాత్రకు ఫార్మోసా కేంద్రముగానుండునని ఫార్మోసా పైప్రాయిచెప్పెను.

---

శికింద్రాబాదు డిస్ట్రిక్టు మున్సిఫ్ కోర్టులో

ఓ. యస్. నం. 65 ఆఫ్ 1939.

వాదులు—బి. వీరన్న అదితరులు

ప్రతివాదులు—రత్నం మరియొకరు.

ఈ క్రింద సంతకము చేసిన రిసీవరు న్యాయస్థానమువారి ఆజ్ఞానుసారముగా బొంబాయిలోని సీతారాం జోవారీవల్ గారి ఖాతాకు చెందిన యొక్క బాకీలను కొన్నిటిని మినహాయించి తక్కినవాటిని హైదరాబాదు (దక్కను) నగరంలో సుల్తాను బజారులో తనఆఫీసువద్ద ౧౯౪౧ జూను ౧౩ వ తేది శుక్రవారం ఉదయం ౧౧ గంటలనుండి వేలమువేసి అందరికంటు ఎక్కువ పాటపాడినవానికి అమ్మగలరు. ఆ అమ్మకమునకు కోర్టువారు ఆమోదము తెలిపిన తర్వాత అది చెల్లును. మినహాయించబడిన బాకీలేవో వాటిని రిసీవరునడిగి తెలిసికొనవచ్చును.

---

హూలా - హవాయిన్ నాట్య ప్రదర్శనములు.

# రెండు దినములు మాత్రమే

**23, 24 మే 1941, శుక్ర, శనివారములు.**

RED TAIL MINSTRELS

AND SOUTH SEA SERENADERS

.. on the Stage!

DANCES! SONGS! LAUGHTER! MUSIC! WIT!

డొనోవాన్ ఆంద్రీన్ గారి ప్రఖ్యాతిగాంచిన నీగ్రోనాట్యములు,

## సౌత్ సీ సెరినేడర్లు: రెడ్ టెయిల్ మినిస్ట్రిల్సు

## మధురమైన గానములు, నాట్యములు, హాస్యములు

సిలోన్ గవర్నర్ గారు వీరిప్రదర్శనము నుచూచి
అత్యుత్తమ మైనదనిశ్లాఘించి యున్నారు.

అనేకపత్రికలు, ప్రముఖులు
ఉత్తమ అభిప్రాయముల నిచ్చియున్నారు.
శికింద్రాబాదుకు వచ్చుటకిదియే ప్రథమము.

# మినర్వాటాకీస్

ఆక్స్ ఫర్డు స్ట్రీట్-శికింద్రాబాదు.

చార్జీలు:- బి. జి. రూ॥ 5, 3, 2, 1, మరియు 8 అణాలు.
పరదా స్త్రీలకు ప్రత్యేకస్థలములేదు.

---

ప్రభాత్ వారి చిత్రరత్నము

# పడోసి

డైరెక్టరు:—ప్రపంచ విఖ్యాతదర్శకుడు శాంతారాం-

ప్రభాత్ వారి చిత్రములలోకెల్ల అత్యుత్తమ స్థానమునహించి,

గొప్ప ఆదర్శయుక్తమగు చిత్రము

# నిషాత్ సినిమా

పూర్వపు సెంట్రల్

---

# రమణీయమైన ప్రకృతిసంపద-

సాధనములు

Godrej

Sandal

## గోద్రెజ్ వెజిటబుల్ టాయిలెట్ సబ్బు-

## తయారుకాబడిన వస్తువ

★ భూమినుండి త్రవ్విన పరిశుద్ధమగు చెట్లమొక్కల తైలములు.

★ శరీర లావణ్యమునకు, విషనివారణకు అనాదికాలమునుండియు ప్రసిద్ధికెక్కిన వనస్పతుల ద్రవ్యములు.

★ దివ్యమైన గంధపు ప్రానులయొక్క చల్లని మనోహరమగు సువాసన,

—సహజ సిద్ధముగా ప్రకృతి దేవత ప్రసాదించిన యీ వస్తు జాలముల సమ్మేళనమే గోద్రెజ్ శాండల్ సోపు అవతారము.

ఎండవేడిమిచే కమలి, అనుతాపమొందిన లేత శరీరములకు యీ సబ్బు వాడినచో చల్లని నురుగు సేదదీర్చి ఆమోఘమైన పోషణ నొసంగును. దీనిని వాడినకొంటనే శరీరమునకు ఒకవిధమైన ఉల్లాసము సంతోషము చల్లదనము చేకూరును.

మీరంతట మీరే వాడి ఆయా భేదములను తెలిసికొనుడు.

యితరరకములు— గోద్రెజ్ 1-వ నెంబరు, 2-వ నెంబరు, లింకా (వెవ మరియు క్షారము సబ్బు.

Godrej SWADESHI PRODUCT

### గోద్రెజ్ సోప్స్ లిమిటెడ్

సేల్సు డిపార్టుమెంటు.

డెలైల్ రోడ్ : : : బొంబాయి.

---

## మీవెంట్రుకలు తళతళ మెరయుచు

## అందముగా నుండుటకు జై హేర్ ఆయిల్

మరియు బ్రిలియంటైన్ ఉపయోగించుడు

A TATA PRODUCT

మాష్టతరకేశ సౌందర్యోపకరణములు ఏవియనసువాసనయుక్తమైన నారికేళ కేశతైలం, కొబ్బరినూనె షాంపూ లైమ్స్ అన్డుగ్లిసరిన్ బ్రిలియంటైన్, గొప్పంగళ్ళలో నెల్ల దొరకను. ఎప్పుడుదొరకు సరకు.

టాంకోసేల్సుడిపార్టుమెంటు మజ్దూబ్ బిల్డింగ్, పత్తెర్గట్టీ హైదరాబాదుదక్కను,

---

## నిజాంరాజ్య ముదిరాజ మహాసభ హైద్రాబాదు.

నిజాంరాజ్య ముదిరాజమహాసభ హైదరాబాదునందు 26 నుండి 28 మే 1941 వరకు సమావేశమగు ఈసందర్భములో 19 నుండి 28 మే 1941 తేది వరకు ఈరైల్వేలో అన్ని స్టేషన్లనుండి హైద్రాబాదు బి. జి. లేక యం. జి. స్టేషన్లకు ఒకటిన్నర ప్రయాణపు చార్జీతో రానుపోను టిక్కెట్లు అన్నితరగతులలో యివ్వబడును. ఈటిక్కెట్లు కొనదలచువారు మహాసభా హ్వానసంఘాధ్యక్షులవారి నుండి, తాము ప్రతినిధులమనియో ప్రేక్షకులమనియో నిర్ణీతకాగితముపై ధృవపత్రము తేవలయును, పైతగ్గింపు యీక్రింది కనీసపు చార్జీలకు తక్కువగాకుండా యుండవలెను.

| | |
|---|---|
| 1 వ తరగతి. | హాలీ రూ, 11-0-0 |
| 2 వ తరగతి, | ,, 5-0-0 |
| 3 వ తరగతి | ,, 1-0-0 |

యీటిక్కెట్లతో తిరుగుప్రయాణము 4జనవరి1942 తేదివరకు పూర్తిచేసుకోవలెను.

యితరవివరములకు
చీఫ్ కమ్మర్షియల్ మేనేజర్
శికింద్రాబాదు.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions

Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

6 Hyderabad-Dn Thursday 22nd May 1941 Number 6


## ౭వ ఆంధ్రమహాసభ

### చిలుకూరుకు బస్సులయేర్పాటు

చిలుకూరు ఆంధ్రమహాసభకు వెళ్లు ప్రతినిధులు స్థాయిసంఘ కార్యాలయమునకు ౧౦వ తేదీవరకు తెలిపి తమతమ పేర్లు నమోదు చేయించిన బస్సుల యేర్పాటు చేయబడునని గోలకొండపత్రికలలో ప్రకటించియుంటిమి కానియింతవరకు వెళ్ళు ప్రతినిధులు మా కార్యాలయమునకు తమ పేర్లు ప్రత్యేకించుకొనలేదు. ఈ ప్రత్యేక మోటారుబస్సుల ఏర్పాటులు సక్రమముగ కావలెనన్నచో ముందుగనే పైకము పంపించి తమ పేర్లు ప్రత్యేకించుకొనవలయును. ఈవిధముగ చేయనిచో ఈ ఏర్పాటు జరుగజాలదు.

చిలుకూరు హైదరాబాదునుండి మిర్యాలగూడెము మీదుగా ౧౧౫ మైళ్లు. సూర్యాపేటమీదు ౫ (బ్రిటిషు ప్రాంతములోనుండి (మునగాల స్టేటు) వెళ్ళవలసివచ్చునందున, ప్రైవేటుబస్సులకు లైసెన్సులు లభించనందున కష్టమగును. మిర్యాలగూడెము మీదుగా బస్సులు నడిపించుటకు, మోటారు బస్సుకి రాయరామభోను ౬ రూపాయిలుపట్టును. ప్రతినిధులైతే హైదరాబాదునుండి వెళ్ళువారో, వారు ఈ ఏర్పాటుల సౌకర్యమువల్ల లాభముపొందదలచుకొన్నచో మా కార్యాలయమునకు ౨౨వ తేది మొదలుకొని ౨౭ మే ౧౯౪౧ వరకు పైకము చెల్లించి పేర్లు రిజిష్టరు చేయించుకొనవలయును. ఇట్లు చేయని ప్రతినిధులు తమ స్వంతము ఏర్పాట్లు చేసుకొనవలసివుంటుంది. బాధ్యత స్థాయిసంఘముపైన ఉండదు.

రైల్వేకన్సెషన్ [తగ్గింపు రేట్లు] కు వ్యవహారము నడుపబడుచున్నది. యేయే స్టేషనులనుండి ఈ ఏర్పాటులు కావలెనో తెలుపమని రైల్వే అధికారులు కోరినారు. తెలంగాణాలోని అన్ని జిల్లాలోని స్టేషనులనుండి ఈ ఏర్పాటు కావలెనని తిరిగి మేము కోరినాము. అనుకూలముగ జవాబు మాకు అందుటతోనే వెంటనే పత్రికాముఖమున ఈ విషయమునకు వివరములు ప్రకటించబడును.

హైదరాబాదునుండి చిలుకూరుకు రైల్వేబస్సు చార్జీలు రానుపోను వాదాపు రూ. ౭ అగును.

హైదరాబాదునుండి ఖమ్మంమీదుగ చిలుకూరుకు వెళ్ళవచ్చును. రైలు, బస్సు చార్జీలు కలిసి దాదాపు ౯ రూపాయిలు అగును. కన్సెషన్ లభించినచో సుమారు రెండురూపాయలు తగ్గును–ఖమ్మమునుండి చిలుకూరు ౩౦ మైళ్ళు–

కల్వకుర్తి తాలూకానుండి చిలుకూరుకు వచ్చే ప్రయాణీకులు దేవరకొండ, మిర్యాలగూడెము మీదుగా రావచ్చును– రైల్వేబస్సుల సౌకర్యమున్నది– రానుపోను రు. ౬ చార్జి.

వరంగల్లు, కరీంనగరం, ఆసిఫాబాద (నిర్మల తప్ప) జిల్లాలవారికి ఖమ్మంనుండి చిలుకూరు ప్రయాణము చేయుటయే సౌకర్యము. తక్కువచార్జీ కూడాను ఇతర జిల్లాలవారు హైదరాబాదునుండే ప్రయాణము చేయవలసివుంటుంది,

మహాసభలో పాల్గొను సోదర సోదరీమణులందరు ఈ ప్రయాణ ఏర్పాటులగురించి శ్రద్ధతీసికొని ముందుగానే తగు ఏర్పాటులు గావించుకొనవలెనని కోరుచున్నాము.


ఇట్లు
చిక్కేపల్లి రామచంద్ర రావు
స్థా-స-కార్యదర్శి-

స్థాయిసంఘ కార్యాలయము
సుల్తానుబజారు, మోజంజాహి మార్కెటుఎదుట దక్షిణ
హైదరాబాదు-


## కోటుదొంగలను పట్టించుట

లక్నో ప్రాంతములో ఒకనాడు నరపత్ అను వాడు తనయింటి బయట చల్లని గాలిలో చల్లగా నిద్రపోతుండినాడు. తెల్లవారవానికి మెలకువ వచ్చింది. చూచుకొనేవరకు వానిచుట్టునూ నలుగురు దొంగలుమూగి ఉన్నారు. ఉక్కిరిబిక్కిరియై ఒక్క ఊపుతో మంచంమీదనుండి ఒకగంతువేసి దొంగలతొత్తిమీదినుండి అవతలికి దుంకి ఆ దేవుని తోడ్దగ్గరఉండె ఒకగుంటలో పడినాడు నీటిలో మునకలు వేసినాడు. ఒకదొంగవానిపై తుపాకిని గురిపెట్టి బయటికి వస్తావా కాల్చి వేస్తు నాఅన్నాడు ఇకచావు తప్పదురా అని మెల్లగా బయటికి వచ్చినాడు.

వాన్ని దొంగలు వానియింటికి పట్టుకొనిపోయినారు నీసొత్తు ఏ నీధనంయొక్క డెక్కడ దాపెట్టినావో చూపించుఅన్నారు తనఅల్మారి. చూపించినాడు, అందులో ఉండే బట్టలు పైకెంతలతొ సొమ్ముదిగాదొంగలుమూటకట్టడంలో నిమగ్నులైవారు కొట్టిడినంతకాలక్రిందు చేసినారు శ్రీమూలమూల బ్రతుక్కినారు ఇంటిలోనెల్లి పతి శీఘ్రబుద్ధికపలాయనఅన్నమంత్రంజపించి తప్పించుకొనిబయటపడినాడు. చుట్టుపట్టులఉండే మందినంతా లేపి వారినిగుంపు చేసి దొంగలమీదికి ఒకచిన్న పల్లనుసిద్ధము చేసుకొని తెచ్చినాడు తమకంటేసంఖ్యఎక్కువగావచ్చినారని దొంగలే భయపడితమకుదొరికినవాటినితొందరతొందరగా సదుకొనిపారిపోయినారు.

మళ్ళీరెండు నెలలనరపత్ కోంగులజాడ కూడా దొరకపోయింది. అయితే అంతలో హీరాలాల్ అనే వాడు తనకు భాగానికివచ్చిన ఒక సంచిపెట్టెనలొట్టు మదర్జాగాకొడుకుకొని సాయంత్రము షికారుకు బజారులో బయలుదేరినాడు అంతలో ... దొంగను పట్టుకొన్నారు. ఇప్పుడు విచారణలో ఉన్నారు.

## సంస్థానాలకు పాకిస్థానం లేదు

### జిన్నాగారి ప్రకటన

ఇపుడు మైసూరుసంస్థానమునందు వందికొండలపైనున్న ముస్లింలీగు అధ్యక్షుడగు జిన్నాగారిని మైసూరుసంస్థానపు ముస్లింలీగు సభ్యులును అధ్యక్షుడును దర్శించి సంభాషించగా జిన్నాగారు పాకిస్థానమునకు సంస్థానములలో ప్రవేశంలేదని చెప్పిరి. సంస్థానాలలో ముస్లింలీగులపై అఖిల భారతముస్లింలీగుకు ఎట్టిపెత్తనము గాని లేదు సంస్థానాలనుగూడా చేర్చుకొన్నచో ఆ సంస్థానాలయొక్క రాజ్యాంగసంబంధస్థితి, సార్వభౌమునితో వాటిసంబంధము మున్నగు అనేకప్రశ్నలు వచ్చును వాటిని ప్రస్తుతమునకు వదలివేయుట మంచిది. కేంద్రసంఘమునకు సంస్థానాల సంఘాలతో సంబంధము లేకున్నను, సంస్థానాల సంఘాలు సంస్థానాలలోని ముసల్మానుల హక్కులు నిగ్రహము చేయబడినపుడు కేంద్రసంఘము యొక్క సహాయమును సానుభూతిని అర్థించవచ్చును. ఉదాహరణార్థము రాజకోట, జయపూరు హైదరాబాదు సంస్థానములలో కేంద్రసంఘమువారి సహాయముచే పరిస్థితులు బాగుపడినవి. మైసూరుసంస్థాన ముస్లింలీగువారికి జిన్నాగారు సలహానిచ్చుచు మైసూరు ముసల్మానులలో విద్యాప్రచారము చేసి వారల ఆర్థిక స్థితిని బాగుచేయవలెననియు, ముసల్మానులందరు ఒక్కమాటపై నిలిచి తమకోరికలను అడిగినచో ఎంతటిబలవంతమైన ప్రభుత్వముకూడా వాటినిఒప్పుకొనక తప్పదనియు జిన్నాగారు చెప్పిరి.

## పాకిస్థానానికి అనుకూలుడనుకాను

### మౌల్వీ ఒబీదుల్లాగారి ప్రకటన

కొన్ని నెలలనుండి మౌల్వీఒబీదుల్లాసింధి అను జాతీయ ముసల్మానునాయకుడు వ్రాసినారని చెప్పుచు ఒకలేఖను ప్రచారము చేయుచున్నారు. ఆ లేఖలో పాకిస్థానసిద్ధాంతమును ఆ ముసల్మాను నాయకుడు ఆమోదించుచున్నట్లుగ లదు. ఈ లేఖ ఉర్దూలోను హిందీలోను, ఇంగ్లీషులోను పత్రికలలో ప్రకటించబడినది. ఈలేఖయొక్క వ్రాతప్రతినమూనాను ఇపుడు ఒబీదుల్లాగారు చూచి ఆ లేఖ తనచే వ్రాయబడినదికాదనియు, దొంగవ్రాతయనియు చెప్పుచున్నారు–ఈవిషయంలో తాను జిన్నాగారికి ఎట్టిలేఖనుగాని వ్రాసియుండలేదని వారనుచున్నారు, అందువల్లపత్రికలలో వ్రాతలను నమ్మవలదని వారనుచున్నారు–

## అంతూగారు- ఉర్దూభాష

హైదరాబాదు శాసనసభా సభ్యులైన రామచంద్రరావు అంతూగారు నారాయణగూడాలోని ఆంధ్రబాలికల ఉన్నత పాఠశాలకు చందా యిచ్చుచుండిరి. ఇటీవల పైపాఠశాలవారు ఉర్దూను నిర్బంధద్వితీయభాషగా ఏర్పాటుచేసి ప్రభుత్వమునుండి ద్రవ్యసహాయమును పొందుచున్నారు. అందుపై అంతూగారు బాలికలకు ఉర్దూను నిర్బంధముగా నేర్పుట సరికాదని తమఅసమ్మతిని తెలుపుచు తమచందాను చాలించినారట. అందుపై రహబరెదక్కన్ పత్రికవారికి కోపమువచ్చినది. చందా ఆపినందుకుకాదు ఉర్దూపై అంతూగారికింత నిరసనమాఅని రహబరు ఆక్షేపించినది. అంతూగారు హిందూముస్లిం సమాధానముకావలెనని నరసింగరావు రామాచార్యులతోకూడా సంతకంచేసి ఒకప్రకటన చేసియుండిరికదా. ఈసమాధానఅర్భాటాలదంకా, ౧౫ గా ప్రమోగకమునుపే అంతూగారు తమఉర్దూద్వేషాన్ని బయటపడవేసుకొన్నారేఆని రహబరు హేళనచేయుచు ఒకచిన్న సంపాదకీయవ్యాఖ్యను నిన్నటి పత్రికలో వ్రాసినది

## మద్రాసులేఖ

### ఆంధ్రదేశ సత్యాగ్రహులు

[స్వకీయ విలేఖరి]

ఆంధ్రదేశసత్యాగ్రహులు ౧౧ మంది ఢిల్లీ యాత్రసాగించుచుండగ దేశరక్షణ నిబంధనల ౧౨౯వ సెక్షనుక్రింద అరెస్టుచేయబడినట్లుతెలుపుచు ప్రకటించబడినది. యిప్పుడువారందరిని మధ్యరాష్ట్రముల ప్రభుత్వము విచారణనిమిత్తం మద్రాసు పంపుచున్నట్లు తెలియుచున్నది.

### మద్రాసు కార్పరేషను

యిటీవల సత్యాగ్రహముచేసి తిరుచునాపల్లి జైలునుండివిడుదలైన శ్రీ కే- వెంకటస్వామి నాయుడు, లీడరు మద్రాసుకార్పరేషను కాంగ్రెసుపార్టి, ఆరకేశవులు నాయకరు (శాసనసభ్యుడు) ఉభయులు మద్రాసునెటికార్పొరేషను సభ్యులు ఈమధ్య మద్రాసుప్రభుత్వము మూడుసమావేశములకు వరుసగహాజరుకానిసభల సభ్యత్వముఅంతరించుటనుగూర్చి కార్పొరేషను ఆక్టు సెక్షను నిర్వచనమునందు అభిప్రాయభేదమువచ్చి మూడుసమావేశములకు హాజరుకానియెడల సభ్యత్వముండునా పూడునాయనువంశమును కోర్టువారినిర్ణయమునకువదులుచు ప్రకటనజేసియున్నారు

ఈసందర్భమున ఒకవిషయము చెప్పవలసియున్నది– మద్రాసుకార్పొరేషను యొక్కనిధికి విరాళమొసగుటచే కాంగ్రెసుకౌన్సిలర్లందరిని రాజీనామాయివ్వమని ఉభయ (తమిళ తెలుగు) రాష్ట్ర కాంగ్రెసుసంఘములు హుకుం ఇచ్చియుండిరి– దానిప్రకారము బయటవున్న కౌన్సిలర్లందరూ రాజీనామాయిచ్చిరి– కొద్దిసందిమినహా జైలులోవున్న పైయుభయులకు ఈహుకుం జారీకానందున వారు రాజీనామా యిచ్చుటకు తటస్థపడలేదు– వారువిడుదలయ్యేకాలమునకు ప్రభుత్వము ఈ క్రొత్తవగలుచిక్కు తెచ్చినవి. అందువలన వారియుభయులు సభ్యత్వనిర్ణయమునకయి హాజరయినట్లు ప్రకటించిరి–

మద్రాసు ఆంధ్రకాంగ్రెసుసంఘపు సెక్రటరీ వారుభయులు కాంగ్రెసుఆజ్ఞనుల్లంఘించి కార్పొరేషనుసభకు హాజరయినందున వారుయికముందు కాంగ్రెసుకౌన్సిలర్లుగ వుండజాలరని ప్రకటన చేసియున్నారు.

### ట్రేడుయూనియన్ కార్యదర్శి రాక

అఖిలభారతట్రేడుయూనియను కార్యదర్శిని శ్రీమతి శాంతలాబాయిగారు మద్రాసునగరమునకు వచ్చియుండిరి. వారువారంరోజులనుండి మద్రాసు ట్రేడుయూనియనులను దర్శించి, వింగారవార్డ్ము కార్పొరేషను మేయరు ఈనెల ౨౨ తేదీని రిప్పన్ భవనములో ఒకవిందొసగిరి. అవిందుకు పురప్రముఖులు, ట్రేడుయూనియన్ నాయకులనేకులు హాజరైరి–

## నిజాంరాష్ట్ర ఆంధ్ర ఆయుర్వేద కళాశాల

౧౯-౫-౪౧ హైదరాబాద్-దక్కన్

నిజాంరాష్ట్రములోని ఆంధ్రులకు ఆయుర్వేదమును ఉత్తమశాస్త్రీయపద్ధతిపై నేర్పించు పాఠశాలలేకుండెను. హైదరాబాదునగరములో ఒక కళాశాలగలదుకాని అందు హిందీలో నేర్పుతున్నారు. హిందీరానిఆంధ్రులకు ఇది చాలా యిబ్బందిగా ఉండెను.

అందుపై అనేకులు ప్రోద్బలముచేయుటచేత మేము ప్రముఖులఅభిప్రాయానుసారముగా ఆంధ్రభాషలో నేర్పించుటకు ఆయుర్వేద కళాశాలను స్థాపించినాము. ఈ కళాశాల రెవండ్లనుండి పనిచేయుచున్నది: శ్రీలంకూడా యిందు చదివినారు. విద్యయంతయు ఉచితమే. ఇప్పుడువేసవి సెలవులున్నవి. చాలామంది నిజామురాష్ట్రములోనేకాక బెజవాడ గుంటూరు మున్నగుప్రాంతాలనుండి జాబులువ్రాయుచున్నారు. అందుచేత ఇందుమూలమున తెలుపుకొనుటయేమన మా కళాశాల ముందునెల జూన్ ౧౫వ తేదినాడు తెరుచుచున్నాము. అభ్యర్థులు జూన్ ౭వ తేదీ లోపల దరఖాస్తులు పంపుకొనవలెను.

నియమాలకుగాని ఇతరవిషయాలకుగాని హైదరాబాదునగరం సుల్తానుబజారులో వావిలాసానికి వ్రాసితెలిసికొనగలరు.


వేదాల తిరుమల వేంకట రామానుజ స్వామి,
ప్రిన్సిపాల్,
౧౯౦ సుల్తాన్ బజారు,
హైదరాబాద్-దక్కన్


## ఆర్యసమాజ సభలు

హైదరాబాదు ఆర్యసమాజమువారు ఈక్రింది స్థలాలలో నుక్రింది తేదీలలోను సభలుచేయుటకేర్పాట్లుచేసినారు. సుల్తానుబజారులో మే నెల ౨౫ నుండి ౨౭వరకు, అనంతగిరిలో మే ౨౯ కాలిబండ–మే౩౧నుండిజూన్౧వరకు నిజామాబాదులో మే౩౧నుండి జూన్ ౨వరకుకిషన్‌గంజిలో జూన్ ౫-౬ చంద్రికాపురంలో జూన్ ౯ కాచీగూడలో జూన్ ౧౦ అలియాబాదులో జూన్ ౧౧ బొల్లారంలో జూన్ ౧౪-౧౫ హైదరాబాదు ఆర్యసమాజం జూన్ ౧౭-౧౯ ధూల్పేటలో జూన్ ౨౧, ౨౨, ౨౩,

## గోపాల్పేట పరిస్థితులు.

(స్వ. వి.) తా॥ ౧౫-౫-౪౧

ఇచ్చటిఆస్పత్రిలో ఆయుర్వేదపుఅవుషధములు చాలా వాడుచున్నారు. శ్రీ ... స్వస్థానములోలేనందున తాలూకాదారుకూడనగరనివాసులైనారు డాక్టరు గారుకూడ వచ్చిపడే ఇచ్చటికి వచ్చుచున్నారు– అక్కడిరోగులగతియేమోయను విచారణలేదు.

ప్రస్తుతముఒకనూతనవు నర్సుకూడవచ్చినది. ఆమె ప్రసవకేసులలోకాక తదితర స్త్రీలసంబంధమైనరోగముల గురుర్చుటలోకూడ బాగపనిచేయుచున్నట్లు తెలిసినది.

చిన్న రాణి గారిప్రోద్బలమున స్థాపింపబడి నిరాటంకంగా జరుపబడుచుండిన రాత్రిపాఠశాల కూడబాగుగా నడుచుచున్నదట.

### తప్పతాగి తైతక్కలాడుట

ఒకఅరబ్బువాడు మహమ్మద్‌బిన్-హిసిర్ అనే వాడు జమీయతులో నౌకరుగా ఉండేవాడు, అతడు గతవారం బాగాకై పెక్కువస్సుతాగి మత్తెక్కి హైదరాబాదునగరములో లింగంపల్లిలో నాలుగుబాటలుకలిసేచోట నిలబడి జంబియాబయటికిలాగి దానినితిప్పుకుంటూ నాట్యమాడుతూ ఎవరువస్తేవాళ్ళను పొడుస్తానని బెదిరించుచూ వీరవిహారంచేసినాడు. టుదకుపోలీసువారు పట్టుకున్నారు. హింసోద్భవ న్యాయస్థానంలో నిలబెట్టినారు. తనతప్పును నిందితుడు ఒప్పుకొన్నాడు. న్యాయాధిపతిగారు నిందితునికి ౩రూ॥ అపరాధంవిధించినారు. నిందితుడు అపరాధాన్ని చెల్లించుకొని యింటిబాట పట్టినాడు.

### ఆఫ్రికాలో యుద్ధము

ఆఫ్రికా యుద్ధములో రెండుప్రధానరంగములు గమనించదగినవి. ఒకటిలిబియా, రెండవది అబిసీనియా

లిబియారంగంలో బ్రిటిషుసేనలు మేం౧౫వ తేది జర్మనులను వెనుకకుతరుముగొట్టగలిగిరి. అవి ధంగా హాల్ఫాయాకనుమను, మసేదును, సోలంను జర్మనులనుండిపట్టుకొనిరి. కాని తర్వాతమూడురోజులలో జర్మనులుమరలసోలంఏగువననుండు దుర్గములనుఆక్రమించిరి. మేం౧౫వ తేదికి పూర్వం తమవశంలోనుండిన అన్నిప్రదేశాలను ఇంకను జర్మనులు ఆక్రమించలేకున్నారు,

అబిసీనియారంగంలోజర్మనులులేరు. ఇటాలీయులతోమాత్రమే బ్రిటిషువారుపోరాడుచున్నారు. ఇందులోమూడుముఖ్యరంగములను విభజించవచ్చును, అంబాఅలాగిరంగము ఒకటి. దానికిదక్షిణమునఒకరంగము. అడిస్‌అబాబాకు దక్షిణంలోచెరువులరంగమొకటి.

అంబాఅలాగిరంగంలో బ్రిటిషుసేనలును భారతీయసేనలును ఉత్తరమునుండియు, దక్షిణాఫ్రికాసేనలు దక్షిణమునుండియువచ్చి అంబాఅలాగిని ముట్టడిచేసినవి. అందుపైఅక్కడ ౩౦౦౦౦ ఇటాలీయ సైనికులతోను ఇతర సైనికాధికారులతోను ఉండిన అబిసీనియా వైస్రాయి ఆయోస్టాడ్యూకుగారు తామందరును బ్రిటిషువారికిలొంగుటకు ఒప్పుకొని యుద్ధమునుమానుకొనిరి. ఇపుడుఅంబాఆలాగి బ్రిటిషువారికి వశమైనది. ఇపుడు అబిసీనియా ఇటాలీయులు ఇకపోరాటము మానెదరని తలచవీలులేదు అంబాలాగికి దక్షిణమున గొండారువద్దను, అడిస్‌అబాబాకు ౨౦౦మైళ్ళదక్షిణమునయుండుచెరువులజిల్లాలోను ఇటాలీయనసేలింకను బ్రిటిషుసేనలను ప్రతిఘటించవచ్చును. అక్కడ ఎన్ని సేనలుండునో తెలియదు.




Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn, Editor- S. Prathapa Reddy B. A B.L.,